# నక్షత్ర చింతామణి

## (నక్షత్రనాడీ గ్రంథము)





ఆంధ్రానువాదం:

బొమ్మకంటి వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి





రోహిణి పబ్లికేషన్స్

మెయిన్‌రోడ్, రాజమండ్రి-1

# *Telugu Books free Download*



*search google or social sites as parakrijaya*




కూర్పు / సేకరణ :-

పి.వి.ఎల్ శ్రీకర్

సెల్ : 9885216452,9966455872

ADDRESS: SRI MEDHADAKSHINAMURTY JYOTISHANILAYAM,
D.NO. 2-159,GANDHI GRAM, NEAR VIGAN SCHOOL , SANTHI NAGAR,
CHODAVARAM,VISAKHAPATNAM, A.P. PIN - 531036.

See My 4 Blogs - P.V.Radhakrishna cell:9966455872,

సాధన ఆరాధన : http://parakrijaya-parakri.blogspot.in/,

శ్రీ మేధా దక్షిణమూర్తి జ్యోతిష నిలయం : http://secureonlinepayments.webs.com/,

http://medhadakshinamurtyjyotishanilayam.blogspot.in/,

తెలుగు పండిత దర్శిని : http://teluguteachers-parakri.blogspot.in/

పరాక్రి పదనిసలు : http://jayaparakri.blogspot.in



http://medhadakshinamurtyjyotishanilayam.blogspot.in/
శ్రీ మేధా దక్షిణా మూర్తి జ్యోతిష నిలయం

SEE MY 4 BLOGS
సాధన - ఆరాధన
http://parakrijaya-parakri.blogspot.in/

తెలుగు పండిత దర్శిని
http://teluguteachers-parakri.blogspot.in/

పరాక్రి http://jayaparakri.blogspot.in/ జయ
CELL 9966455872
పదనిసలు
CELL 9966680542

Like FB page : https://www.facebook.com/SRIMEDHADAKSHINAMURTYJYOTISHANILAYAM,

న క్ష త్ర చిం తా మ ణి

— బొమ్మకంటి వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి



తొలి ముద్రణ :
మార్చి - 1995

మలి ముద్రణ :
డిసెంబరు - 1998

మూల్యం : రు. 35/-

ముద్రణ :
వంశీకృష్ణా ప్రింటర్స్
విజయవాడ-2.

ప్రకాశకులు :

ఫోన్ : 73444

రో హి ణి ప బ్లి కే ష న్స్
మెయిన్ రోడ్
రాజమండ్రి — 1

# వి ష య సూ చి క

# ముందుమాట

ఈ మా రోహిణి పబ్లికేషన్స్‌ను స్థాపించిన నాలుగు వసంతాలుగా, మా సంస్థ ప్రచురణలపట్ల యెనలేని ఆదరాభిమానాలను కురిపిస్తున్న అశేషాంధ్ర పాఠక లోకానికీ, గ్రంథ క్రయ విక్రయాదులలో ప్రత్యేక శ్రద్ధ చూపిస్తున్న పుస్తక విక్రేతలకీ, సహృదయులూ-సహావృతులూ యైన సాటి ప్రచురణకర్తలకీ, సర్వదా మా శ్రేయోభిలాషులైన సుహృ ద్బాంధవకోటికీ—పెద్దలకీ అందరికీ మా కృతజ్ఞతాభివాదాలు.

ముఖ్యంగా యీ "నక్షత్ర చింతామణి" పుస్తకం పట్ల మీరందరూ చూపించిన ఆదరాభిమానాలకు ప్రత్యేక విశేషాంజలులు. ఆ మీ ప్రోత్సాహమే వూతంగా యిప్పుడీ గ్రంథాన్ని పునర్ముద్రించడం జరిగింది.

నిజానికి-ప్రస్తుతం మార్కెట్లో పేపరు ధర, ప్రెస్సుల ఛార్జీలు అధికంగానే ఉన్నప్పటికీ కూడా -

మా ప్రచురణల క్రయ విక్రయాలలో ప్రత్యేక శ్రద్ధ వహించే పుస్తక విక్రేతల అనుభవపూర్వకమైన సలహాలనూ - జ్ఞానమూర్తులైన పెద్దల, శ్రేయోభిలాషుల ఆదేశాలనూ-విజ్ఞానలాలసులైన ఆబాలగోపాల పాఠక మహాశయుల జిజ్ఞాసాపూర్వకమైన ఉత్తరాలనూ దృష్టిలో వుంచుకుని- "నక్షత్ర చింతామణి" యొక్క యీ ద్వితీయ ముద్రణలో మరొక 40 పేజీల వరకూ క్రొత్త విషయాలను కూడా కలపడం జరిగింది.

పుస్తకం పేరుకు తగినట్లుగా శిశుజననాదిగండాలూ, ఏ వారం ఏ నక్షత్రమైతే ప్రయాణానికి శోభస్కరమో సూచించే ఆనందాదియోగాలూ మొదలయిన అనేక విషయాలను కూడా కలిపి మరీ ప్రచురించాము.

సహృదయులూ, జిజ్ఞాసువులూ అయిన పాఠకులు గతంలోవలెనే ఈ గ్రంథాన్ని ఆదరిస్తారనీ — మమ్మల్ని మరింత పురోభివృద్ధి దిశగా ప్రోత్సహిస్తారనీ కోరుతూ -

మరొక్కసారి కృతజ్ఞతాంజలులతో

**రోహిణి పబ్లికేషన్స్**

# సంజాయిషీ

అందరికీ హృదయపూర్వక నమస్కారాలు !

ఈ పుస్తకంలో వ్రాయబడిన ప్రథమ రజస్వలా ఫలితాల గురించి అనేకమంది సందేహాలను వెలిబుచ్చుతూ ఉత్తరాలు వ్రాయడం వలన — యీ నాలుగు సంజాయిషీ ముక్కల్నీ మీ ముందుంచుతున్నాను.

ఇందులో వ్రాయబడిన ప్రథమ రజస్వలా ఫలితం కేవలం నక్షత్రం వల్ల కలిగే ఫలమే తప్ప—పూర్తి ఫలం కాదని మనవి. ఎందుకంటే— ప్రథమ రజస్వలా ఫలమనేది - ఆ కాలానికి ఆ బాలిక ధరించినదుస్తులు, వాటిరంగు,దృఢత్వాలపైనా, ఆ వారంపైనా- ఆ పూటపైనా-ఆ లగ్నంపైనా కూడా ఆధారపడి వుంటుంది. వాటితోబాటే నక్షత్ర ఫలం కూడా ఒకటి మాత్రమే. తక్కిన అన్ని అంశాలూ బలహీనమై - ఒక్క నక్షత్రం మాత్రమే బలంగా ఉన్నప్పుడు తప్ప-అది పూర్తి ఫలితాన్నివ్వలేదు. ఒక వేళ ఆ తార చెడు తార అయినట్లయితే జప హోమదానాదులవల్ల శాంతి చేసుకోవచ్చును నక్షత్రం చెరుపు చేయడాన్ని దృఢంగా నమ్మేవాళ్ళు శాంతుల్ని కూడా నమ్మి—వాటి నాచరించినట్లయితే ఆ దోషాలు ఖచ్చితంగా తొలగిపోతాయి. అందువలన - కంగారు పడవలసిన అవసరం లేదని మనవి చేస్తున్నాను.

కృత్తికా నక్షత్రంలో పుట్టిన వాళ్ళకి - జన్మతోనే ఆరంభమయ్యే రవి దశాశేషం కలవరపెడుతుందని అనేక మంది చెబుతున్నారు. కాని, ఆ రవి శుభుడైనా, ఇతర శుభగ్రహాలు బలవత్తరాలై శుభ స్థానాలలో వున్నా—అటువంటి జాతకులకి యే కలతా వుండటం లేదనేది - అనుభవములో తెలుస్తున్న సత్యం.

కాబట్టి, తల్లులూ తండ్రులూ - రజస్వలాఫల విషయంలో కంగారు పడవలసిన పనిలేదనీ—ఆ విషయాలు శాస్త్రంలోవున్నవేతప్ప నా స్వంత ఊహలు కావనీ - శతథా మనవి చేసుకుంటున్నాను. శలవ్ -

సదా మీ

**రచయిత**

## శిశు జననం - నక్షత్ర పాద దోషములు

| నక్షత్రములు | 1 వ పాదం | 2 వ పాదం | 3 వ పాదం | 4 వ పాదం |
|---|---|---|---|---|
| అశ్విని | తండ్రికి | మంచిది | మంచిది | మంచిది |
| భరణి | మంచిది | మంచిది | మంచిది | శిశువుకు |
| కృత్తిక | మంచిది | మంచిది | మంచిది | తల్లికి |
| రోహిణి | పిత్రు మేనమామ | పిత్రు మేనమామ | పిత్రు మేనమామ | పిత్రు మేనమామ |
| మృగశిర | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| ఆరుద్ర | మంచిది | మంచిది | మంచిది | తల్లికి |
| పునర్వసు | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| పుష్యమి | మంచిది | పిత్రు మాత్రు | పిత్రు మాత్రు | మంచిది |
| ఆశ్రేష | మంచిది | శిశువుకు | తల్లికి | తండ్రికి |
| మఖ | తండ్రికి | తండ్రికి | మంచిది | మంచిది |
| పుబ్బ | మంచిది | మంచిది | మంచిది | తల్లికి |
| ఉత్తర | పిత్రు మాత్రు | మంచిది | మంచిది | మంచిది |
| హస్త | మంచిది | మంచిది | పిత్రు మాత్రు | మంచిది |
| చిత్త | తల్లికి | తండ్రికి | మంచిది | మంచిది |
| స్వాతి | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| విశాఖ | మంచిది | మంచిది | మంచిది | తల్లికి |
| అనూరాధ | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| జ్యేష్ఠ | తల్లికి | సోదర, మేనమామ | శిశువుకు | తండ్రికి |
| మూల | తండ్రికి | తల్లికి | ధనమునకు | మంచిది |
| పూర్వాషాఢ | మంచిది | మంచిది | తండ్రికి | మంచిది |
| ఉత్తరాషాఢ | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| శ్రవణం | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| ధనిష్ఠ | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| శతభిషం | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| పూర్వాభాద్ర | మంచిది | మంచిది | మంచిది | శిశువుకు |
| ఉత్తరాభాద్ర | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| రేవతి | మంచిది | మంచిది | మంచిది | తండ్రికి |

## ప్రయాణము వారీ వార నక్షత్రములను బట్టి శుభాశుభ ఫలము తెలుసుకొను ఆనందాది యోగములు

| ఆది | సోమ | మంగ | బుధ | గురు | శుక్ర | శని | యోగం | రోజులు | ఫలితం |
|---|---|---|---|---|---|---|---|---|---|
| అశ్వి | మృగ | ఆశ్లే | హస్త | అనూ | ఉషా | శత | ఆనంద | 15 | కార్యసిద్ధి |
| భర | ఆర్ద్ర | మఘ | చిత్త | జ్యే | అభి | పూభా | కాలదండ | 27 | కార్యసిద్ధి |
| కృత్తి | పున | పుబ్బ | స్వాతి | మూ | శ్రవ | ఉభా | ధూమ్ర | 8 | ధననష్టం |
| రోహి | పుష్య | ఉత్త | విశా | పూషా | ధని | రేవ | ధాత్రీ | 4 | కార్యసిద్ధి |
| మృగ | ఆశ్లే | హస్త | అనూ | ఉషా | శత | అశ్వి | సౌమ్య | 30 | సర్వసౌఖ్యం |
| ఆర్ద్ర | మఘ | చిత్త | జ్యేష్ఠ | అభి | పూభా | భర | ధ్వాంక్ష | 5 | కార్యహాని |
| పున | పుబ్బ | స్వాతి | మూల | శ్రవ | ఉభా | కృత్తి | ధ్వజ | 10 | కార్యసిద్ధి |
| పుష్య | ఉ.ఫ | విశా | పూషా | ధని | రేవ | రోహి | శ్రీవత్స | 3 | లాభం |
| ఆశ్లే | హస్త | అనూ | ఉషా | శత | అశ్వి | మృగ | వజ్ర | 2 | కార్యహాని |
| మఘ | చిత్త | జ్యేష్ఠ | అభి | పూభా | భర | ఆర్ద్ర | ముద్గర | 1 | కలహం |
| పుబ్బ | స్వాతి | మూల | శ్రవ | ఉభా | కృత్తి | పున | ఛత్ర | 3 | స్త్రీ లాభం |
| ఉ.ఫ | విశా | పూషా | ధని | రేవ | రోహి | పుష్య | మిత్ర | 5 | మిత్రలాభం |
| హస్త | అనూ | ఉషా | శత | అశ్వి | మృగ | ఆశ్లే | మానస | 2 | కార్యలాభం |
| చిత్త | జ్యేష్ఠ | అభి | పూభా | భర | ఆర్ద్ర | మఘ | పద్మ | 1 | ఐశ్వర్యప్రదం |
| స్వాతి | మూల | శ్రవ | ఉభా | కృత్తి | పున | పుబ్బ | లంబ | 3 | కష్టం నష్టం |
| విశా | పూషా | ధని | రేవ | రోహి | పుష్య | ఉఫ | ఉత్పాత | 4 | ద్రవ్యనాశం |
| అనూ | ఉషా | శత | అశ్వి | మృగ | ఆశ్లే | హస్త | మృత్యు | 10 | సర్వధ్వంసం |
| జ్యేష్ఠ | అభి | పూభా | భర | ఆర్ద్ర | మఘ | చిత్త | కాల | 5 | అవమానం |
| మూల | శ్రవ | ఉభా | కృత్తి | పున | పుబ్బ | స్వాతి | సిద్ధి | 7 | కార్యసిద్ధి |
| పూషా | ధని | రేవ | రోహి | పుష్య | ఉ.ఫ | విశా | శుభ | 6 | [illegible] |
| ఉ.షా | శత | అశ్వి | మృగ | ఆశ్లే | హస్త | అనూ | అమృత | 2 | కార్యసిద్ధి |
| అభి | పూభా | భర | ఆర్ద్ర | మఘ | చిత్త | జ్యేష్ఠ | ముసల | 8 | దుఃఖం |
| శ్రవ | ఉభా | కృత్తి | పున | పుబ్బ | స్వాతి | మూల | గదా | 40 | చెరుపు |
| ధని | రేవ | రోహి | పుష్య | ఉ.ఫ | విశా | పూషా | మాతంగ | 2 | అశ్వలాభం |
| శత | అశ్వి | మృగ | ఆశ్లే | హస్త | అనూ | ఉషా | రాక్షస | 9 | మిత్రకలహం |
| పూభా | భర | ఆర్ద్ర | మఘ | చిత్త | జ్యేష్ఠ | అభి | చల | 8 | దుర్వార్తలు |
| ఉభా | కృత్తి | పున | పుబ్బ | స్వాతి | మూల | శ్రవ | సిద్ధి | 3 | మిశ్రమఫలం |
| రేవ | రోహి | పుష్య | ఉఫ | విశా | పూషా | ధని | వర్ధమాన | 10 | శివదర్శనం |

పార్వత్యాః శివప్రోక్త

# నక్షత్ర చింతామణి

## ప్రార్థనము

శ్లో॥ శ్రీమద్గణేశం విధిముఖ్య వంద్యం
గౌరీసుతం విఘ్నతమో దినేశం
కళ్యాణ సంవర్థిత భక్తలోకం
సర్వార్థ సిద్ధ్యర్థ మహం భజామి॥

శ్లో॥ గురుర్ బ్రహ్మ-గురుర్విష్ణుః
గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్ పరబ్రహ్మ
తస్మై శ్రీ గురవేనమః॥

వెలుగు మణుల్ కన్న పేరఖిల విద్యలకున్ పరమార్థభూతమై
వెలుగులు తన్నుమించి మఱి విశ్వమునందున వేఱుచోటలే
వలఘుడు శిష్యవత్సలుడు సంబుధి శోషణదాహమూర్తి, వె
ల్గుల నిధికిన్ గురూత్తమునకున్ జగదత్తునకున్ నమ
స్కృతుల్॥

## *- నవగ్రహ ధ్యాన స్తోత్రములు -*

శ్లో॥ ఆదిత్యాయ చ సోమాయ మంగళాయ బుధాయ చ।
గురు శుక్ర శనిభ్యశ్చ రాహవే కేతవే నమః॥

1 రవి : 6 వేలు

జపాకుసుమ సంకాశం । కాశ్యపేయం మహాద్యుతిం
తమోఘ్నం సర్వపాపఘ్నం । ప్రణతోస్మి దివాకరం॥

2 చంద్ర : 10 వేలు

దధిశంఖ తుషారాభం । క్షీరోదార్ణవ సంభవం
నమామి శశినం సోమం । శంభో ర్మకుటభూషణం॥

3 కుజ : 7 వేలు

ధరణీగర్భ సంభూతం , విద్యు త్కాంచన సన్నిభం
కుమారం శక్తిహస్తం తం । మంగళం ప్రణమామ్యహం॥

4 బుధ : 17 వేలు

ప్రియంగు కలికాశ్యామం । రూపేణ ప్రతిమం బుధం
సౌమ్యం సత్వగుణోపేతం । తం బుధం ప్రణమామ్యహం॥

5 గురు : 16 వేలు

దేవానాంచ ఋషీనాంచ । గురుం కాంచనసన్నిభం
బుద్ధిమంతం త్రిలోకేశం । తం నమామి బృహస్పతిం॥

6 శుక్ర : 20 వేలు

హిమకుంద మృణాళాభం । దైత్యానాం పరమం గురుం
సర్వశాస్త్ర ప్రవక్తారం । భార్గవం ప్రణమామ్యహం॥

7 శని : 19 వేలు

నీలాంజన సమాభాసం । రవిపుత్రం యమాగ్రజం
ఛాయామార్తాండ సంభూతం । తం నమామి శనైశ్చరం॥

8 రాహు : 18 వేలు

అర్థకాయం మహావీరం । చంద్రాదిత్య విమర్దనం
సింహికాగర్భ సంభూతం । తం రాహుం ప్రణమామ్యహం॥

9 కేతు : 7 వేలు

ఫలాశ పుష్ప సంకాశం । తారకా గ్రహ మస్తకం
రౌద్రం రౌద్రాత్మకం ఘోరం।తం కేతుం ప్రణమామ్యహం॥

# నాంది

శ్రీ కల్యాణ రమా విలాసమైన కైలాసశిఖరాన, సర్వలోకేశ్వరుడయిన శర్వుడు-యేకాంతంగా, విశ్రాంతిగా సుఖాసీనుడయివున్న అదనులో—

జగన్మాత-అఖిలాండేశ్వరీ-శివప్రియాయయిన పార్వతీ దేవి, ఆ పరమేశ్వరుణ్ణి సమీపించి, ప్రణమిల్లి—

"స్వామీ! దేవతలందరికీ దైవమయినవాడా! నిత్య చంచల శీలమైన ప్రపంచ సమస్తానికీ సుస్థిర యజమానివయిన వాడా! భక్తులను అనుగ్రహించడమే పనిగా పెట్టుకున్న వాడా! సర్వలోకహితాన్నీ దృష్టిలో వుంచుకున్న వాడివై, దయామతివై నన్ను సమాధానపరచు.

హే స్థావరజంగమాది సమస్త భూతాంతర్వర్తీ! స్థాణూ! నక్షత్రాల స్వరూపస్వభావాలేమిటి? చుక్కలుగా పిలవబడే ఈ రిక్కలు లోకం వయినా, లోకులమీదా తమ ప్రభావాన్ని యెలా ప్రకటిస్తాయి? వాటివలన సంభవించే శుభాశుభాల నెలా నిరూపించాలి? ప్రాణేశ్వరా! ఇటువంటి సందియాలతో కుందుతూన్న నా డెందాన్ని సమాధాన పరచడమనేది సర్వజ్ఞుడవైన నీకు మాత్రమే సాధ్యమవు తుంది. అనుగ్రహమూర్తీ! జిజ్ఞాసువునయిన నన్ను కృతా ర్థను చేయి." అని కోరింది.

ప్రాణవల్లభయైన పర్వతవర్ధని పలుకులకి ప్రీత మానసుడయ్యాడు పినాకపాణి. అఖిల జగన్నాథుడైన ఆ అర్ధేందుధరుడు-దరహాసి తాధరుడై-ఇలా చెప్పసాగాడు.

"పార్వతీ! ముల్లోకాలవారికీ కూడా యెంతో గుహ్యంగా వున్న విషయమై ప్రశ్నించావు. అయినా, నాకు ప్రాణతుల్యవయిన నీ ముచ్చట తీర్చడం కోసం, నువ్వు ఆశ

స్తూన్న లోకహితాన్ని నెరవేర్చడం కోసం నక్షత్ర రహస్యాలను వినిపిస్తాను. శ్రద్ధగా విను.

దేవీ! దివి నిండా వ్యాపించి, లెక్కించడానికి అలవి కానన్నిగావున్న ఈనక్షత్రాలు కోట్లాది సంఖ్యలో గుంపులు గుంపులుగా యేర్పడి—శూన్యమంతా విస్తరించి వున్నాయి. వీటిలో కొన్ని సూర్యునికన్నా చిన్నవిగాగా, ఇంకొన్ని సూర్యసమాన విశాలాలుగానూ, మరికొన్ని సూర్యుడికంటే పెద్దవిగానూ కూడా వున్నాయి. ఈ నక్షత్రాల నగటు ఆయుర్ధాయం-2,50,00,000(అక్షరాల ఇరవయ్యయిదుకోట్లు) సంవత్సరాలు.

ఇతరేతర రోదసీ పదార్థాలకు మల్లేనే, ఈ నక్షత్రాలు కూడా తమ నుండి కొన్ని ద్రవ్యాలను భూమికి అందజేస్తూ వుంటాయి. ఆ ద్రవ్యాలు—ఆయా తారలలో ప్రభవించిన జీవుల పాంచభౌతిక శరీరాలలో నిక్షిప్తాలయి వుంటాయి, గనుకనే—జన్మనక్షత్రాన్నిబట్టిగాని, పిలుపు రిక్క—ని (నామ నక్షత్రాన్ని) బట్టి కాని-ఆ జాతకుల జీవితంలో కలగబోయే శుభాశుభాలను తెలియ జేయవచ్చునని చెప్పబడుతోంది.

అంబికా! ఆకాశంలో మనకు కనుపించే అశేష తారాలోకం అగణ్యమే అయినప్పటికీ—ఆ నక్షత్రమండలం నుంచి ఇరవయ్యేడు ఋక్షాలు ప్రధాన తారలుగా గుణించ బడుతూన్నాయి. ఆ నక్షత్రాలు ఇవి.

## నక్షత్రనామాని

1. అశ్విని
2. భరణి
3. కృత్తిక
4. రోహిణి
5. మృగశిర
6. ఆరుద్ర
7. పునర్వసు
8. పుష్యమి
9. ఆశ్రేష (ఆశ్లేష)
10. మఖ (ఘ)
11. పూర్వాఫల్గుణి (పుబ్బ)
12. ఉత్తరఫల్గుణి(ఉత్తర)
13. హస్త
14. చిత్ర (చిత్త)
15. స్వాతి
16. విశాఖ
17. అనూరాధ
18. జ్యేష్ఠ
19. మూల
20. పూర్వాషాఢ
21. ఉత్తరాషాఢ (అభిజిత్)
22. శ్రవణం
23. ధనిష్ఠ
24. శతభిషం
25. పూర్వాభాద్ర
26. ఉత్తరాభాద్ర
27. రేవతి

నమ్ముతావో లేదోగాని నగరాజనందినీ! ఈ ఇరవయ్యేడు నక్షత్రాలలోనూ జ్యేష్ఠా, ఆరుద్రలు అతి పెద్ద నక్షత్రాలు సుమా!! ఇవి సూర్యుడికన్నా కూడా 40(నలభై) రెట్లు అత్యధికమైన ఉష్ణోగ్రతను కలిగిస్తాయి. తద్వారా లోకానికి నష్టం కలగకుండా ఉండడం కోసమే - ఇటువంటి తారలు-కొన్ని లక్షల-కోట్ల కాంతి సంవత్సరాల కవతల

అక్కడెక్కడో స్థిరపడి - చూపరులకి చుక్కలమల్లే కనిపి స్తున్నాయి.

ఇక—ఈ ఇరవయ్యేడు నక్షత్రాలలోనే ఉత్తరాషాఢా శ్రవణ తారల మధ్యలో 'అభిజిత్' అనే ఒకానొక నిరామయ నక్షత్రం కూడా వుంది. కాని, ఆ నక్షత్రాన్ని గుర్తించడం అత్యంత కష్టసాధ్యమైన విషయం కావడం వలనా—గృహారంభ, గృహప్రవేశానికి ముహూర్త నిర్ణయాలప్పుడు ప్రయోగించే "వృషభ" "కలశ" చక్రాదులలో గణన సౌకర్యం కోసమే తప్ప—తదితర వేళల్లో ఆ ఋక్ష ప్రయోజనం అంతగా కానరానందువలనా-అభిజిత్తనబడే ఆ తారాస్థానం అంతంత మాత్రమే అయిపోయింది. ఏతావాతా ఈ ఋక్ష సంఖ్య సప్తవింశతిగానే శాస్త్రోదిత మయ్యింది. నగసూతీ! నక్షత్రాలు ఇరవయ్యేడు.

ఈ ఇరవయ్యేడు నక్షత్రాలలోనూ-ప్రతీ ఒక్క తారకీ నాలుగు పాదాలుంటాయి. మొత్తం ఈ నూటఎనిమిది(108) పాదాలేగాక - వాటికి విడివిడిగా రాశ్యంశలు కూడా వుంటాయి.

అశ్విని, రోహిణి, పునర్వసు, మఖ, హస్త, విశాఖ, మూల, శ్రవణం, పూర్వాభాద్ర-అనబడే తొమ్మిదినక్షత్రాల ప్రథమ పాదాలూ మేషాంశకు—ద్వితీయ పాదాలు వృషభాంశకు - తృతీయపాదాలు మిథునాంశకూ — చతుర్థ పాదాలు కర్కటాంశకూ చెంది వుంటాయి. అనంతరం—

భరణి, మృగశిర, పుష్యమి, పూర్వాఫల్గుణి (పుబ్బ), చిత్ర, అనూరాధ, పూర్వాషాఢ, ధనిష్ఠ, ఉత్తరాభాద్ర - ఈ తొమ్మిది తారల యొక్క ప్రధమ పాదాలూ సింహాంశకూ—ద్వితీయపాదాలు కన్యాంశకు—తృతీయ పాదాలు తులాంశకూ - చతుర్థపాదాలు వృశ్చికాంశకూ చెంది వుంటాయి. అటుపైన—

కృత్తిక, ఆరుద్ర, ఆశ్లేష, ఉత్తర, స్వాతి, జ్యేష్ఠ, ఉత్తరాషాఢ, శతభిషం, రేవతి అనబడే ఈ తారానవకానికి ప్రధమపాదాలు ధనూరాంశకూ-ద్వితీయ పాదాలు మకరాంశకూ - తృతీయ పాదాలు కుంభాంశకూ - చతుర్థ పాదాలు మీనాంశకూ-చెంది వుంటాయి.

నగరాజనందినీ! ఈ అంశలేకాకుండా - నక్షత్రాల యొక్క పాదాలకు అధిగ్రహాలూ, అధ్యంశలూ వేరుగా వున్నాయి. వాటిని తదుపరి క్రమంలో వివరిస్తాను.

## తారాబల వివరణం

ఇక తారాబలాన్ని విను :- శరీరధారులు-తాము జన్మించిన నక్షత్రమాదిగా-ఆనాటి నిత్యనక్షత్రంవరకూ లెక్కవేసి, తొమ్మిదితో భాగించగా వచ్చిన శేషం — ఒకటయితే అది జన్మతార - మంచిదికాదు. శరీరపీడ కలిగిస్తుంది.

రెండయితే సంపత్తార - మంచిది. సంపదనిస్తుంది.

మూడయితే విపత్తార - మంచిదికాదు. పనులను పాడు చేస్తుంది.

నాలుగయితే క్షేమతార - మంచిది. కుశలాన్ని కలిగిస్తుంది.

అయిదయితే ప్రత్యక్తార - చెడ్డది. ఫలహాని

ఆరయితే సాధనతార-ఉత్తమం. ప్రయోజనాన్ని సాధింప చేస్తుంది

ఏడయితే నైధనతార - క్రూరమైనది. మరణాన్ని కలిగిస్తుంది.

ఎనిమిదయితే మిత్రతార—సుఖసౌఖ్యాలనిస్తుంది!

తొమ్మిది పరమ మిత్రతార – ఇదికూడా సుఖాన్ని వర్ధిల్ల చేస్తుంది.

## మరొక పద్ధతి

ఇంకా సూక్ష్మంగా రావాలంటే దిగువ పట్టికను చూడండి

(జన్మతార అశ్వినిగావి, మఖగాని, మూలగాని అయితే)

| | |
|---|---|
| అశ్వని, మఖ, మూలలు జన్మతారలు | -1 |
| భరణి, పుబ్బ, పూర్వాషాఢలు సంపత్తారలు | -2 |
| కృత్తిక, ఉత్తర, ఉత్తరాషాఢలు విపత్తారలు | -3 |
| రోహిణి, హస్త, శ్రవణం-క్షేమతారలు | —4 |
| మృగశిర, చిత్త, ధనిష్ఠ-ప్రత్యక్ తారలు | -5 |
| ఆరుద్ర, స్వాతి, శతభిషం-సాధనతారలు | -6 |

పునర్వసు, విశాఖ, పూర్వాభాద్ర-నైధనతారలు -7
పుష్యమి, అనూరాధ, ఉత్తరాభాద్ర-మిత్రతారలు -8
ఆశ్లేష, జ్యేష్ఠ, రేవతి-పరమమిత్రతారలు -9

భరణి, పుబ్బ, పూర్వాషాఢలలో ఒకటి మీ జన్మతార ఐతే

భరణి, పుబ్బ, పూర్వాషాఢ—జన్మతారలు -1
కృత్తిక, ఉత్తర, ఉత్తరాషాఢ—సంపత్తారలు -2
రోహిణి, హస్త, శ్రవణం—విపత్తారలు -3
మృగశిర, చిత్త, ధనిష్ఠ—క్షేమతారలు -4
ఆరుద్ర, స్వాతి, శతభిషం-ప్రత్యక్ తారలు -5
పునర్వసు, విశాఖ, పూర్వాభాద్ర-సాధనతారలు -6
పుష్యమి, అనూరాధ, ఉత్తరాభాద్ర-నైధనతారలు -7
ఆశ్లేష, జేష్ఠ, రేవతి-మిత్రతారలు -8
అశ్విని, మఖ, మూల,—పరమిత్రతారలు -9

ఉపరివిధంగా ఎవరి జన్మతారను బట్టిగాని, నామనక్షత్రాన్ని బట్టిగాని వారు తమతమ తారాబలాలను ఎంచి చూసుకోవాలి.

ఈ గణనంలో 1-3-5-7 తారలు చాలా చెడ్డవి. ఆ నక్షత్రాలలో ఎటువంటి కార్యక్రమాలూ తలపెట్టకూడదు

తప్పనిసరి అయితే-జన్మతార ప్రారంభాది 7 ఘడియలు విడిచి-యేదయినా కూర(శాకము)ను దానంచేసి, తమపని చేసుకోవాలి.

మూడవదయిన విపత్తారలోని కర్మలకు-ఆ తార ప్రారంభాది 3 ఘడియలు విసర్జించి-బెల్లం దానంచేసి-తదుపరి పనులు చూసుకోవాలి.

అయిదవదయిన ప్రత్యక్తారలోని పనులకు - తారాదిగా 8 ఘడియల్ని వదలి-ఉప్పు దానం చేయాలి.

ఏడవదయిన నైధనతారకు కూడా - తారాది 8 ఘడియల్ని విసర్జించి-నువ్వుల్ని, బంగారాన్ని దానంచేసి పనులు చక్క-బెట్టుకోవాలి.

## మతాంతరం

మరికొందరు-జన్మతారలో 3వ పాదాన్ని, విపత్తారలో ప్రథమ పాదాన్ని, ప్రత్యక్తారలో నాలుగోపాదాన్ని, నైదనతారలో ద్వితీయపాదాన్ని విసర్జించి-తక్కిన పాదాలలో పైన చెప్పిన దానాదులుచేసి, దోషపరిహారానంతరం కార్యక్రమాలు నడుపుకోవాలని చెబుతారు.

## గ్రంథాంతరం

వేరుగా కొందరు ఋషులు—

జన్మనక్షత్రం మొదలు తొమ్మిది నక్షత్రాలను లెక్కించి–ఆ నవకంలో జన్మతారను విసర్జించాలి. 3,5 తారలలో దానాలిచ్చి పనులు చేసుకోవచ్చును పదోతారనుంచి పునః తొమ్మిది తారలు లెక్కించి ఆ నవకంలో 3వ దైన విపత్తారను విసర్జించాలి. ఈ నవకంలో 1,5, తారలలో దానాలనిచ్చి పనిచేసుకో

వచ్చును. తిరిగి 19వ తారనుంచి తొమ్మిదితారల్ని లెక్కించి-ఈ నవకంలో 5వ దయిన ప్రత్యక్తారను విసర్జించాలి. ఇప్పుడు 1,3 తారలలో దానాల నిచ్చి పనులు చూసుకోవచ్చును.

ఈ 3 నవకాలలోనూ ఎప్పుడూ, ఏనాడూ కూడా యేడవదైన నైధనతారలో మాత్రం యేపనీ తలపెట్ట కూడదు. ముఖ్యంగా వ్రాతకోతలు పనికిరావు. కేవలం తారాదోష శాంతికోసం-దానాలుమాత్రంచేసుకోవచ్చును-అనిచెప్పారు.

## నక్షత్రరీత్యా మాసఫలము తెలియుట

ప్రతినెలా శుద్ధ పాడ్యమీ తిథితో అరంభమవుతుంది ఆనాడున్న నక్షత్రాన్ని గ్రహించి, అది మొదలు-జన్మ నక్షత్రంవరకూ లెక్కగట్టాలి. మొత్తాన్ని 9తో భాగించాలి. శేషాన్నిబట్టి మాసఫలం దిగువ విధంగా వుంటుంది.

| శేషసంఖ్య | ఆ మాసఫలితం | శేషసంఖ్య | మాసఫలితం |
|---|---|---|---|
| 1 | పంథ | 6 | వస్త్రలాభ |
| 2 | సంభోజ్యం | 7 | విపులశోక |
| 3 | దేహతాపం | 8 | అనంతపుణ్య |
| 4 | శౌర్యం | 9 | మహాఫల |
| 5 | విద్యా | | |

## నక్షత్రరీత్యా సంక్రాంతిఫలం

జన్మనక్షత్రం మొదలు-సంక్రాంతి ప్రవేశవేళనాటి నక్షత్రం వరకూ లెక్కించి, ఆ సంఖ్యని 7చే గుణించి, 8తో

భాగించగా మిగిలిన శేషానుసారం ఫలితం దిగువ విధంగా తెలుసుకోవాలి.

| శేషసంఖ్య | ఫలితం | శేషసంఖ్య | ఫలితం |
|---|---|---|---|
| 1 | రోగం | 5 | ధనం |
| 2 | లాభం | 6 | ఐశ్వర్యం |
| 3 | ప్రయాణం | 7 | ధనలాభం |
| 4 | బంధనం | 8 | రాజపీడ |

## మరొక పద్ధతి

శుక్ల పక్షాదిగా సంక్రమణ తిధి సంఖ్యనీ, ఆదివారాదిగా వారసంఖ్యనీ, అశ్విన్యాదిగా నక్షత్ర సంఖ్యనీ, అదే విధంగా జన్మనక్షత్ర సంఖ్యనీ కలిపి-ఆ మొత్తాన్ని 7తో భాగించగా—

| శేషసంఖ్య | ఫలితం | శేషసంఖ్య | ఫలితం |
|---|---|---|---|
| 1 | రోగం | 5 | సంపద |
| 2 | లాభం | 6 | భోగం |
| 3 | మృత్యువు | 7 | ధనక్షయం |
| 4 | హాని | | |

## వేరొక పద్ధతి

సూర్యాచార నక్షత్రాది-జన్మతారను లెక్కించగా-ఆ సంఖ్య 2 అయితే చక్కటి ధనలాభం. అటుమీదట తారాచతుష్కం (నాలుగు నక్షత్రాలు) ప్రయాణకారి. ఆపై చతుష్కం శుభాధికం, మీదటి పంచకం (అయిదు తారలు) బంధనం, తదుపరి చతుష్కం సంతోషం, అటు మీది తారాత్రయం విజయం, కడపటిది అధికభయం.

# నక్షత్రాత్ మాసాధిపతి నిర్ణయం

జన్మతారాది-మాసారంభమైన శుక్ల పాడ్యమినాటి నక్షత్రంవరకూ లెక్కించి, ఆ సంఖ్యను 7తో గుణించి, 9తో భాగించగా-శేషరీత్యా-మాసాధిపతిని తెల్సుకోవాలి.

| శేషసంఖ్య | మాసాధిపతి | ఫలితం |
|---|---|---|
| 1 | రవి | తాపం, దుఃఖం, ప్రయాణం, తలనొప్పి, రాజభయం. |
| 2 | బుధుడు | విద్వత్సహవాసం, విష్ణుభక్తి, బంధుసమాగమం, ధనలాభం |
| 3 | రాహువు | ఉదరశూలాదులు, కోపం, ధననష్టం, దొంగలబెడద |
| 4 | బృహస్పతి | ధనలాభం, దారాసౌఖ్యం, జ్ఞానం, గురుభక్తి, అలంకారం |
| 5 | కేతువు | బంధువైరం, సర్పభయం, దుష్టస్త్రీకలహం, స్వల్పాధికారం |
| 6 | చంద్రుడు | పెరుగుతో భోజనం, రతిసుఖం, ధనలాభం, మనశ్శాంతి |
| 7 | శని | ఉదరశూలాదులు, కోపం, ఏనుగువల్ల భయం, పరపీడ |
| 8 | శుక్రుడు | స్త్రీసౌఖ్యం, ధనలాభం, ధన-పశులాభం, సుగంధప్రాప్తి |
| 9 | కుజుడు | రక్తదర్శనం, కార్యవిఘ్నం, దుఃఖం, రాజభయం, శస్త్రభయం |

# నక్షత్ర రీత్యా వారఫలం

పార్వతీ! మానవుల జన్మతార - యే వారంనాడు వస్తే యేమి ఫలితమో చెబుతాను విను.

| జన్మతార వచ్చిన వారం పేరు | దాని ఫలితం | తారావారం | ఫలితం |
|---|---|---|---|
| ఆదివారం | ప్రయాణం | గురువారం | ధనలాభం |
| సోమవారం | స్త్రీ సంగమం | శుక్రవారం | స్వేచ్ఛా భోజనం |
| మంగళవారం | మృత్యువు | శనివారం | విశేష రోగభీతి |
| బుదవారం | ధనలాభం | | |

# నక్షత్ర భేదాలు

1. అశ్విని హస్త పుష్యమి–ఇవి క్షిప్రతారలు
2. మూల, ఆరుద్ర, జేష్ఠ, అశ్లేషలు–దారుణతారలు
3. చిత్త, రేవతి, మృగశిర, అనూరాధ – మృదుతారలు
4. రోహిణి, ఉత్తరాత్రియం - ఉగ్రతారలు
5. భరణి, మఖ, పూర్వాత్రయం–క్రూరతారలు
6. స్వాతి, పునర్వసు, శ్రవణం,ధనిష్ఠ శతతారలు-చరతారలు
7. కృత్తిక, విశాఖలు–సాధారణ తారలు

## ఇతర విభేదాని

గౌరీ ! సూర్యుడున్న నక్షత్రం మొదలు –
వరుసగా 4 తారలు అంధనక్షత్రాలు
తదాది 6 తారలు – ద్వినేత్రాలు
అటుమీదట 9 తారలు - ఏకనేత్రాలు
తరువాతి 5 నక్షత్రాలు – ద్వినేత్రాలు
కడపటి 3 తారలూ– అంధతారలు

అదేవిధంగా—

సూర్యుడున్న నక్షత్రమూ–దాని ముందు వెనుకలగల నక్షత్రాలు-వెరసి 3 తారలూ మృతనక్షత్రాలు.

తదుపరి 7 ఋక్షాలు అర్ధజీవాలు.
మీదట 1 - మృతతార.
దానిపైన 8–సంపూర్ణ తార జీవనక్షత్రాలు.
తరువాతి 1 తార నిర్జీవం.
కడపటి 7 తారలూ పాదజీవ ఋక్షాలు.

# అశ్వత్థామ జన్మించిన —
# అశ్వనీ నక్షత్ర విషయం

శివుడు చెబుతూన్నాడు –

గౌరి ! గజాశ్వబంధనకీ, నూతనంగా రథం (బండి) మీద ప్రయాణించడానికీ, క్రొత్తపూరిలో అడుగు మోపడానికీ, వైద్యారంభానికీ, మంత్రస్వీకార జపారంభాలకీ, గృహ-సౌధ-గ్రామాదుల ప్రతిష్ఠాపనోత్సవాలకీ, యాత్రకూ, పట్టాభిషేకాదులకి, యజ్ఞయాగాది క్రతుదీక్షా స్వీకారానికీ, చౌల-మౌంజీ ధారణాదులకీ, శాంతులకీ ఈ అశ్వినీ నక్షత్రం యోగ్యమై విరాజిల్లుతోంది.

అన్ని నక్షత్రాల రీతిగానే దీనికి నాలుగు పాదాలుంటాయి. చూ, చే, చో, లా అనే నాలుగు అక్షరాలూ ప్రత్యేక పాదానికీ క్రమంగా వర్తిస్తాయి. అనగా-అశ్విని మొదటి పాదమునకు 'చూ' అను అక్షరము, రెండవ పాదమునకు 'చే' అను అక్షరము, మూడవ పాదమునకు 'చో' అనునదియు నాలుగవ పాదమునకు 'లా' అనునదియు సంజ్ఞలుగా వర్తించును.

ఈ నక్షత్రం కృష్ణ వర్ణంలో వుంటుంది. మూడు తారలు గుఱ్ఱపు ముఖం ఆకారంగా కూడివున్నదే అశ్వనీ నక్షత్రమండలం.

6)

ఇది పురుషతార. దేవగణానికి చెందినది. అశ్వ యోని, అశ్వనీదేవతలు దీని కధిదైవాలు, వైశ్యజాతి. చతుష్పాత్తు, తిర్యఙ్ముఖం, మందనేత్రాలు, వేగవతం, పట్టణ స్థానాలలోని వాయుప్రాంతాలు ఆటపట్టు.

ఈ నక్షత్రానికి ముశుండి అధివృక్షం. భేరుండం అధి పక్షి.

అగజాతా! అశ్వత్థామ ఈనక్షత్రంలోనే జన్మించాడు తారోదయాది యాభై ఘడియాలుపైన విషనాడి. తత్కాల యాత్రలో మాషపిష్ట (మినప పిండి) భక్షణం తటస్థిస్తుంది. అన్నిదిక్కుల ప్రయాణాలకూ అనుకూలమైన తార.

నగనందినీ ! ఈ నక్షత్రంలో జ్వరగ్రస్తులయినవారు తొమ్మిదిరోజులు పీడింపబడతారు. ఈ దినసవకం అరిష్ట కాలంగా భావించాలి. తగిన శాంతి జరిపించాలి.

## అథ
## అశ్వనీ తారారిష్ట శాంతిః

శ్వేతవర్ణం, ద్విభుజం, అమృత భాండాన్నీ-కమండువులనూ ధరించివున్నదీ, తెల్లని పూవులతో- వస్త్రాలతో కూడినదీయైన అశ్వినిని బంగారపు ప్రతిమయందు ఆవాహన చేయాలి. మలయజ గంధం, గుగ్గిల ధూపం, తామర పూవులతో అర్చించాలి. క్షీరాన్నం నైవేద్యముంచాలి.

"దేవస్యత్వా..."

ఇత్యాది మంత్రయుతంగా షోడశోపచారాలతోనూ పూజించాలి.

క్షీరాన్నం, సమిధలూ, ఆవునెయ్యితో- గాయత్రీ అష్టోత్తర శతంతో హోమం చేయాలి.

గంధ మాల్యాదులూ, మినుముతో వండిన అన్నాన్ని తూర్పుదశలో బలిగా యివ్వాలి. ఈ విధంగా శాంతి జరపడం వలన అశ్వినీతారా సంజాతాలైన అరిష్టలు ఉపశమిస్తాయి. వారంరోజులలో స్వస్థత కలుగుతుంది.

అశ్వనీ తారతో కూడివచ్చిన తిథివారముల వలని.

## యోగములు - ఫలములు

1. అశ్వినీ-ఆదివారం-ఆనందయోగం-ప్రయాణానికి మంచిది.
   ఆ రోజు సప్తమీ తిథియుక్తమయితే దగ్ధయోగం.
   అష్టమీ తిథియుక్తమయితే ఉత్పాతయోగం.
2. అశ్వినీ - సోమవారం - శుభయోగం.
3. అశ్వనీ - మంగళవారం- అమృతసిద్ధి యోగం.
   ఆ రోజు అష్టమీ తిథియుక్తమయితే మాత్రం ఉత్పాత యోగం.
   అశ్వినీ తార మంగళవారం, అష్టమీతిథితో కూడిన మధ్యాహ్న వేళ రక్తనాసికా యోగం.
4. అశ్వినీ నక్షత్రం - బుధవారం -మృత్యుయోగం

5. అశ్వినీ నక్షత్రం-గురువారం—శూలయోగం
6. అశ్వినీ నక్షత్రం-శుక్రవారం-రంధ్రయోగం
7. అశ్వినీ నక్షత్రం-శనివారం-నిర్జీవయోగం

అశ్వినీ తారనాడు పుబ్బా నక్షత్రం క్రూరగ్రహ యుతమైతే_అది మహాశూల యోగం. ఆ మధ్యాహ్నం ఎఱ్ఱటి మేఘం కనబడుతుంది. వానకూడా పడవచ్చును. ఉగాది పండుగనాడయితే—శూన్యఫలం.

ఈ నక్షత్రంలో ఉత్పాతాలు సంభవిస్తే-ప్రజలకు వాయుపీడ కలుగుతుంది.

## ప్రథమ రజస్వలా ఫలం

గిరిజా ! ఈ అశ్వినీ నక్షత్రంలో ప్రథమరజస్వలయైన కన్య ధనవంతురాలూ, సత్పుత్రవంతురాలూ, భోగభాగ్య శాలీ అవుతుంది.

## ఇతరాన్

శివా! స్త్రీ సంగమానికీ, అన్నప్రాశనకీ, నామకరణ చౌలోపనయనాలకీ, వేదశాస్త్రాభ్యాసానికీ, తైలాభ్యంగ నానికీ, నూతనవస్త్ర ఆభరణధారణకీ, రాజ్యాభిషేకానికీ, (క్రొత్త) పల్లకీ నధిరోహించేందుకూ,రథంయెక్కేందుకూ, వాస్తు కర్మలకూ, చిత్రలేఖనానికీ,వ్యవసాయప్రయోగానికీ

బీజావాపనకీ, కొబ్బరి స్థాపనకీ, యాత్రలు ప్రారంభించ డానికీ, శ్రాద్ధకర్మలకీ, వైద్యారంభాది శుభకార్యాలకీ ఈ అశ్వినీ నక్షత్రం ప్రశస్తమైనదిగా తెలుసుకో.

## అశ్వనీ నక్షత్రంలో జన్మించినవారి గుణగణాదులు

అపర్ణా! ఈ అశ్వినీ నక్షత్రంలో జన్మించినవాళ్ళు దీర్ఘాయువు కలవాళ్ళవుతారు, స్థూలకాయులు, పొడుగాటి చేతులు–చిన్న ముక్కు–విశాలమైన కళ్ళుకలవాళ్ళు,చక్కటి రూపవంతులు, అందరిచేతా ప్రేమించబడేవాళ్ళూ,సమర్థులు, తెలివైనవాళ్ళు, రాజగౌరవం పొందేవాళ్ళూ, ఆభరణ ప్రియులు, చెడుసావాసాలు కలవాళ్ళూ, సాహసవంతులు, లోభులు, చాపల్యం కలవాళ్ళు, కటిప్రాంతంలో తిలకాదు (పుట్టుమచ్చలు వగయిరా)లు కలవాళ్ళుగా వుంటారు.

## అంశా ఫలం

అశ్వినీ నక్షత్రం ప్రథమపాదం కుజునియొక్క తన్క రాంశకు చెందినదికావడంవలన, ఆ జాతకులు వైభవో పేతులు, భోగులూ, యోధులు, లోభులు, పరస్త్రీరతులు, చేతివాటం కలవాళ్ళుగా వుంటారు.

అశ్వినీ నక్షత్ర ద్వితీయపాదం శుక్రునిది. భోగాంశ కావడంవలన తత్పాదజాతులు ధర్మాత్ములు, తేజోవం తులు, ధనధాన్యవృద్ధి గలవాళ్ళు అవుతారు.

ఈ తారయొక్క తృతీయపాదం బుధునిది. విలక్ష

నాంశ ఏతత్పాదంలో జన్మించినవాళ్ళు వైభవోపేతులు, భోగులూ, యుద్ధాలలో గెలుపొందేవాళ్ళుగా వుంటారు.

ఈ అశ్వినీనక్షత్ర చతుర్థపాదం చంద్రునిది-ధర్మాంశ. ఈ పాదంలో పుట్టినవాళ్ళు దేవపూజాతత్పరులు, నిత్యం ధర్మకార్యాచరణలో నిమగ్నమయ్యేవాళ్ళుగా వుంటారు.

శార్వాణీ! ఈ నక్షత్రంలో జన్మించినవారి జీవితం కేతుమహాదశతో ప్రారంభమవుతుంది. ఈ దశ 7సం॥లు అనంతరం శుక్రమహాదశ. అది 20 సంవత్సరాలు,

నక్షత్రాది 2 ఘటికలు గండాంతకాలం – అభుక్త దోషం.

ఈ నక్షత్రంలో జన్మించినవారికి జననాది ప్రథమ సంవత్సరము అగ్నిభయం; మూడవయేట ఉదరవ్యాధి, అయిదవయేట నేత్రవ్యాధి, ఆరవయేడు నడుమ ద్రవ్య హాని, పదవయేటగాని- ఇరవయ్యవ యేటగాని మేహరోగం కలుగుతాయి. ఇరవయ్యొకటవ సంవత్సరం అపమృత్యు భయం. వుంది. 24వ యేటదొంగలవలనా-మృగాదులవలనా భయం 40వ యేట పునః మారక ప్రమాదంవుంది. ఆ గండంగడిస్తే 91సంవత్సరాలు ఆయుర్దాయంతో శోభిస్తారు.

# భరణీ నక్షత్రం

పార్వతీ! మూడు నక్షత్రాలు ముక్కోణాకృతితో కలది భరణీ నక్షత్రం. ఇది స్త్రీలింగ తార. మనుష్యగణం, గజ యోని, చండాలజాతి. అధిదైవతం యముడు. అధోముఖం, మధ్యలోచనం, ఉగ్రస్వభావం, స్థానం గ్రామం-మండలం అగ్ని, అధివృక్షం ఉసిరి. అధిపక్షి కాకి, ఈ నక్షత్రంలో దుర్యోధనుడు పుట్టాడు.

ఈ తారకి స్వరం టకారం.

ఈ తారాసమయాది 24 ఘటికల తర్వాత విషనాడి ఆరంభమవుతుంది. ఆ సమయంలో యాత్రాది ప్రారంభా లను విసర్జించాలి.

ఈ తారాప్రవేశాత్ తొలి 7 ఘటికలలో తండుల భక్షణం కలుగుతుంది.

తూర్పు, ఉత్తర దిక్కుల ప్రయాణానికి ఈ నక్షత్రం మంచిది.

ఒకవేళ ఈ నక్షత్రంలో అనారోగ్యం చేసినట్లయితే, ప్రాణావసాన వేళలో కూడా ఇరవైయ్యొక్క రోజులు మారక దినాలవుతాయి.

తచ్ఛాంత్యర్థం :-

కృష్ణవర్ణంతో కూడినదీ, రెండు చేతులుగలదీ, పాశాన్నీ-దండాన్నీ ధరించినదీ, దున్నపోతు నధిరోహించి వున్నదీ అయిన యమధర్మరాజు విగ్రహాన్ని నిర్మించి నక్ష త్రాధిపతియైన యముణ్ణి ఆ ప్రతిమయందు ఆవాహనచేసి,

"యమాయసోమమ్" ఇతి-మంత్రాద్యాః షోడశోప చార పూజలు నిర్వర్తించాలి. నీలవస్త్రం, కృష్ణా గురు గంధం, తామర పుష్పం, మహిషాక్షి - ద్రవ్య ధూపం, బెల్లంతో కూడిన అన్నం నివేదన-చెయ్యాలి.

గాయత్ర్యష్టోత్తరయుతంగా -- నేయి, తేనెలతో హోమం చెయ్యాలి. ఈ విధమైన శాంతికాండద్వారా-11 రోజులలో రోగి స్వస్థులవడం జరుగుతుంది.

## తిధి వార యోగ ఫలాలు

భరణీ నక్షత్రయుక్త ఆదివారం అగ్నియోగం
" " సోమవారం గండయోగం
" " మంగళవారం యమకంటకం
" " బుధవారం సప్తమీ తిథియుతమైతే-నాశనయోగం
" " గురువారం-క్రూరయోగం
" " శుక్రవారం—శూలయోగం
" " శనివారం-మరణయోగం-నిర్జీవయోగం_

మఱియు-శనివారంనాడు భరణీ నక్షత్ర ద్వితీయపాదం గడిచే సమయం విషయోగమవుతుంది.

భరణీ నక్షత్రంనాడు మఖానక్షత్రం క్రూరగ్రహయుత మైతే మహాశూలయోగం. ఫాల్గుణ మాసంలో శూన్య యోగం.

ఈ నక్షత్రంలో ఉత్పాతాలు కనిపించినట్లయితే-శీత (మలేరియా) జ్వరాలూ, దుర్భిక్షమూ కలుగుతాయి. ఎరుపు మేఘం, వర్షం సూచించబడుతున్నాయి.

## ప్రథమ రజస్వాలా ఫలం

ఈ నక్షత్రంలో రజస్వలయైన స్త్రీ దరిద్రురాలు, భర్తృవియోగత ప్త అవుతుంది.

## ఇతరాన్

శత్రువులతో యుద్ధం, విషప్రయోగం, జలప్రవేశం, నిక్షేప సంగ్రహం, అంజనాది ప్రయోగం, బిలప్రవేశం, అభిచారం, మాయాజాలం, జూదం, దొంగతనం, పర ద్రవ్యహరణం, క్రూరధాన్య బీజవాపనం, ముళ్ళతో కూడిన చెట్లునాటడం, సేవకులను చేర్చుకోవడం, గయాది పవిత్ర క్షేత్రాలలో చేయబడే శ్రాద్ధాదులకూ-ఈ నక్షత్రం ప్రశస్తమైనది.

## జాతగుణాది

ఈ నక్షత్రంలో పుట్టినవాళ్ళు—చపలురు, అధిక శత్రువులు కలవాళ్ళూ, సుఖవంతులు, దీర్ఘాయుష్మంతులూ, సత్యవాదులూ, మంచిభోజనంపట్ల ఆసక్తికలవాళ్లూ, అతి నిద్రాపరులూ, తత్తర్కాల విశేషణంగా రవంత ఎరుపురంగు కన్నులు కలవాళ్లూ, విశాలమైన ఫాలభాగం కలవాళ్లూ, వంకర టింకర తలవెంట్రుకలు కలవాళ్ళూ, భోగనీయ శరీర సౌష్ఠవులూ, బొడ్డు ప్రాంతంలో తిలకాది (పుట్టుమచ్చలు వగయిరా) చిహ్నాలు కలవాళ్ళూ అవుతారు.

ఈ నక్షత్రంలో జన్మించకపోయినా లీ, లూ, లే, లో- అనే అక్షరాలలో ఏ ఒక్క అక్షరంతో ప్రారంభమయ్యే పేరుగల వారైనా—వారిమీదకూడా ఈ ఋక్షప్రభావం వుండితీరుతుంది.

## అంశగుణాలు

ఈ భరణి నక్షత్రం మొదటిపాదం రవిది– ఇది నృపాంశ ఈ పాదంలో జన్మించినవాళ్ళు రాజగౌరవాన్ని పొందుతారు. సమస్తమైన మంచి లక్షణాలను కలిగి వుంటారు.

ద్వితీయపాదం బుధునిది. ఇది నపుంసకాంశ–వీళ్ళు పరమలోభులు, ముఖ్యంగా డబ్బువిషయంలో అతి లోభులు నపుంసకులుగా వుంటారు.

తృతీయ పాదం శుక్రుడిది - అభయాంశ–బాధ్యతా రాహిత్యమైన జీవితాన్ని ఆశించేవారూ–అవసరకార్యాలలో అత్యంత ఉత్సాహవంతులూ, శూరులుగా వుంటారు.

చతుర్థపాదం కుజుడిది- పాపాంశ– ఈ జాతకులు క్రూర స్వభావులూ, కృతఘ్నులూ, ఇతరులపట్ల మత్సర మంతులూ, అధిక సంతానవంతులూ, ఇత్యాదిగుణాలు కలిగి వుంటారు.

ఈ నక్షత్రవేళ జన్మించిన వాళ్ళ జీవితం-శుక్రమహా దశతో ప్రారంభమవుతుంది. ఇది 20సంవత్సరాలు. అనంతరం రవిదశ ప్రారంభమవుతుంది. అది 6 సంవత్సరాలు.

ఈ నక్షత్రజాతకులకి-పుట్టిన 3వరోజు మధ్యాహ్న వేళ అగ్నిభయం, 5వయేట-వాతజ్వరభయం.

2 1/2 సంవత్సరాల లోపల -మృగ భయం,
24వ యేట మారకం-అదిదాటితే-85 సంవత్సరాలు పరమాయుర్దాయము.

# కృత్తికా నక్షత్రం

ఆ, ఈ, ఊ, ఏ - అనేవి కృత్తికా నక్షత్రాక్షరాలు. 6 తారలుకూడి వుంటాయి. మండలం అగ్ని. స్థానం శూన్యం. అధివృక్షం ఔదుంబరం అధిపక్షణముని, పురుష తార, రాక్షసగణం. "మేక యోని" బ్రాహ్మణజాతి, అధోముఖం.

తారాది 30 ఘటికలు తదుపరి వటనాడి,

ఈ నక్షత్రంలో-'అగ్ని' జన్మించింది.

ఈ తారలో తొలి 20 ఘటికలయందును యాత్రా/ లేదా/ ప్రయాణములు చేయకూడదు.

ఆ 20 ఘటికల అనంతరం దధ్యోజనం (పెరుగుఅన్నం) తిన్నట్లయితే తూర్పు, ఉత్తర దిశలుగా ప్రయాణం చేయ వచ్చును.

ఈ కృత్తికానక్షత్రంలో వ్యాధిగ్రస్తులయినవారికి- కృత్తికానక్షత్రం మొదటిపాదంలో జ్వరపడినవారికి 9 రోజులు, ద్వితీయ పాదంలో అస్వస్థులయినవారికి 11 రోజులు, మూడవపాదంలో జబ్బు పడినవారికి 16 రోజులూ నాలుగవపాదంలో నలతకలిగినవారికి 38 రోజులూ అరిష్ట ప్రదాలు. తచ్ఛాంతి నిమిత్తంగా

## కృతికా నక్షత్ర శాంతి జపమంత్రము

మంత్రం;- "ఓం అగ్నిర్మూర్థాదివః కకుత్పత్తిః
పృధివ్యా అయం అ పా ఓం
రేతా ఓం సిజిన్వతిఓం అగ్నయేనమః॥"

పై మంత్రమును పదివేలసార్లు జపించవలెను. జపము

చేయలేనివారు, ఎవరైనా సద్బ్రాహ్మణునిచే జపము చేయించుకుని. వారి కిష్టమగు ప్రతిఫలమును ముట్ట చెప్పి, జప ఫలమును తాము ధారపోయించుకొనవలెను. ధార పోయించుకొనుట కూడా మంత్రపూర్వకముగా జరుప వలెను. అనంతరము దిగువ విధముగా శాంతిపూజను చేసు కొనవలెను.

## అథ శాంతి పూజా విధిః

మేకవాహనం, ఎరుపురంగు, నాలుగు చేతులు అందులో రెండు చేతులు వరాల్నిస్తున్నట్లుగా వున్న ప్రతిమ యందు అగ్నిని అవాహనం చేయాలి.

"అగ్నిన్నఃపాతుకృత్తికా" ఇత్యాది మంత్రాలతో షోడశోపచారాలతో పూజచేయాలి—ఈపూజలో ఎర్రటి వస్త్రం ఎర్రటి గంధం, కరవీరపుష్పం, నేతితో కూడిన గగ్గుల ధూపం నేతితో కూడిన అన్నం నివేదించాలి.

పూజానంతరం గాయత్ర్యష్టోత్తర శతసహితంగా మధువు ఘృతం, ఆజ్యంకలవి-హోమం చేయాలి.

ఆ హోమానంతరం - గంధమాల్యాది దధ్యోన్నా ద్యుల్ని - ఆగ్నేయదిశగా బలిచేయాలి.

ఈ విధంగా చేయడం వలన అరిష్టాలు శాంతించి, రోగులు అతిత్వరలోనే కోలుకుంటారు.

## తిథివారయోగ ఫలాదీన్

ఈ కృత్తికా నక్షత్రం ఆదివారంనాడు వచ్చినట్లయితే అది రంధ్రయోగం.

ఇదే నక్షత్రం సోమవారంనాడువస్తే-అది నాశయోగం

మంగళవారమయితే-యమకంటకయోగం
బుధవారమయితే-అమృతయోగం
గురువారమయితే-శూలయోగం
శుక్రవారమయితే-శుభయోగం
శనివారమయితే-మిత్రయోగం

—కృత్తికా శనివారం-సప్తమీతిథి అయితే మహా శూలయోగం. కార్తీక మాసంలో శూన్యయోగం.

ఈ తారలో ఉత్పాతాలు కనుపిస్తే-దుర్భిక్షం, అగ్ని భయం కలుగుతాయి. ఇదే తారలో రవి సంక్రమణ మయితే ధరలు మధ్యమంగా వుంటాయి.

వీటిలో-అమృత, శుభ, మిత్రయోగాలు శుభప్రదాలు. అయినప్పటికీ-సప్తమీతిథి కృత్తికా నక్షత్రం కలిస్తే-అది మరణయోగమే అవుతుంది.

## ప్రథమరజస్వలాదీన్

కృత్తికానక్షత్రంలో ప్రథమ రజస్వల అయిన కన్య-దరిద్రురాలవుతుంది.

అందుగా-కృత్తిక ప్రథమపాదమయితే-కొంత శుభం జరుగుతుంది. ద్వితీయపాదమైతే-కగ మంది బ్రాహ్మణులకు భోజనం పెట్టాలి. 3, 4 పాదాలైతే - బ్రాహ్మణ సమారాధనతో బాటు, తప్పనిసరిగా నవగ్రహ శాంతి చేయాలి.

## ఇతరాన్

ఈ తారలో క్షురకర్మ చేయించుకోకూడదు.

విషప్రయోగ, ధాతువాద, సువర్ణ శాస్త్ర లోహశాస్త్రా రంభాలకీ, పరద్రవ్యాపహరణకీ, అప్పులు తీర్చడానికీ, ధన ధాన్యాలు సమకూర్చుకోవడానికీ, పశువిక్రయానికీ, అంజన సంగ్రహణానికీ, ముళ్ళచెట్లు పాతడానికీ ఈ తార శ్రేయస్కర మైంది. ఈ తారలో ఎవరైనా మరణించినట్లయితే - ఆ ఇంటిని నాలుగు నెలలపాటు విడిచిపెట్టాలి.

## జాతకగుణగణాః

ఈ తారాజాతులు బుద్ధిమంతులు, తేజోవంతులు, కీర్తిమంతులు, అతి తిండిపోతులు, బంధుప్రియులూ, స్వయం కృషితో సంపాదించుకునేవాళ్ళు, పాపచింతాపరులుగా వుంటారు. కంఠప్రాంతంలో మత్స్యాంకం వుంటుంది.

## పాదాంశాది

ఈ తార ప్రథమపాదం గురుడిది-ధనాంశ—ఈవేళా సంజాతులు - ధనికులు, ప్రతాపవంతులు, నిపుణులుగా వుంటారు.

ద్వితీయపాదం శనిది-పాపాంశ - ఈ జాతకులు పాప కర్మలూ, వేశ్యాగృహాలలో జీవించేవాళ్ళూగా వుంటారు.

తృతీయపాదంకూడా శనిదేకాని, ఉగ్రాంశ కావడం

వలన—నైపుణ్యం వున్నప్పటికీ మందబుద్ధులుగా వుంటారు. చెడుసావాసాలు చేస్తారు.

చతుర్థపాదం గురువుది. ఉత్కృష్టాంశ-వీళ్ళు విద్యా వినయసంపన్నులూ, ధార్మికులుగా వుంటారు.

వీరి జీవనం ఆరు సంవత్సరాల గడువుగల రవిమహా దశలో ప్రారంభమవుతుంది. తరువాతది చంద్రదశ. అది పది సంవత్సరాలు.

ఈ తారా జాతులకు జననాదిగా—మూడవ నెలలో జ్వరభయం, మొదటి ఏడాది చలిజ్వరం, రెండవయేట సర్ప గండం, 5-7-12 సంవత్సరాలలో వాతజ్వరభయం, ఆయుధ భయం కలుగుతాయి. ఇరవయ్యొకటవయేట అపమృత్యు భయం దానిని అధిగమించితే 80 సంవత్సరాలు పర మాయువు.

కృత్తికాతారలో జన్మించకపోయినా—ఆ-ఈ-ఊ-ఏ- అనే అక్షరాలతో ప్రారంభమయ్యే పేర్లుగల వారందరి మీదా ఈ ఋక్షప్రభావం ఉంటుంది.

# రోహిణి

పార్వతీ!- ఈ నక్షత్రం కృష్ణవర్ణంలో వుంటుంది. 5 నక్షత్రాల కూటమి-బండి ఆకారంలో యేర్పడి వుంటాయి. దానినే రోహిణీ మండలం అంటారు.

ఇది "స్త్రీ" నక్షత్రం. మనుష్యగణం. స్థానం చంద్ర మండలం. అధివృక్షం నేరేడు. అధిపూరం దీర్ఘం. "ఓ, వా, వీ, వూ," అనే నాదాలూ ఈ నక్షత్రానికి సరిపడతాయి. అధిపక్షి హంస, అధియోనిపాము. అధిదైవతం బ్రహ్మ. జాతిబ్రహ్మణం. చతుష్పాత్, ఊర్ధ్వముఖం, దృష్టిలోపం, మనోవాంఛా స్థిరత్వం,

ఈ నక్షత్రప్రవేశాదిగా-౪౦ ఘటికల అనంతరం విష నాడి ప్రారంభం. నెయ్యి, తేనె కలిపిన పదార్థాలను భుజించేందుకు, కోరినదిశగా ప్రయాణించేందుకు మంచితార.

ఈ రోహిణీ నక్షత్రంలో రోగపీడితులయిన వారికి వారం (7) రోజులపాటు అరిష్టం కలుగుతుంది.

అందుకు శాంతిగా—

### రోహిణి నక్షత్ర శాంతి జపమంత్రము

మంత్రం : ఓం బ్రహ్మయజ్ఞానం ప్రథమం పురీసాద్విసే మతః
సురుచోవేన ఆవః సుబుధ్న్యా ఉపమా అస్య విష్ఠాః
శతశ్చయోని మసతశ్చ వివః
ఓం బ్రహ్మణే నమః

పై మంత్రమును అయిదువేల పర్యాయములుజపించి కాని, లేదా జపము చేయించి ఆ ఫలమును ధారబోయించు కొనిగాని దిగువ తెల్పిన విధముగా శాంతిపూజ నాచరించ వలెను.

## అథ శాంతి పూజా విధిః

4 చేతులూ, ఆ హస్తాలలో అక్షసూత్ర కమండులు వులూ కలిగి, హంసవాహనంపై అలరారుతూ, కృష్ణ వర్ణీయుడైన బ్రహ్మను ప్రతిమలోకి-ఆవాహనం చేయాలి.

'నమోబ్రహ్మణః' అనే మంత్రాద్యంగా షోడశోప చారాలతోనూ పూజించాలి. పూజలో నీలిరంగు వస్త్రా లనీ, కస్తూరీ గంధాలనీ, తామర-లేదా-కలువ-పువ్వుల్నీ, సర్జక ధూపాన్నీ వినియోగించాలి. క్షీరాన్నాన్ని నివేదించాలి

గాయత్రీ అష్టోత్తర శత సమేతంగా నవధాన్యాల తోనూ హోమం చేయాలి. గంధమాల్యాదులూ, క్షీరో దనాన్ని ఉత్తరదిశగా బలికుంచాలి. తద్వారా—'అస్వ స్థులు' తొమ్మిది రోజులలో కోలుకుంటారు.

## తిధివారయోగఫలః

రోహిణి నక్షత్రం ఆదివారం అయితే-శుభయోగం

" " సోమవారమయితే-సిద్ధయోగం

" " మంగళవారమయతే-సిద్ధయోగం

(ఒకవేళ అది పౌర్ణమీ తిథి అయితే మాత్రం సిద్ధ యోగం కాదు-అది అగ్నియోగం అవుతుంది.)
రోహిణీ నక్షత్రం బుధవారంతో కూడి-ఆ రోజువ షష్ఠీ తిథి అయితే ఆనందయోగం.

రోహిణీ నక్షత్రయుక్త గురువారం-మృత్యుయోగం
రోహిణి నక్షత్రయుక్త శుక్రవారం యమకంటకయోగం
రోహిణీ శనివారం అమృతయోగం.

ఆ రోజు తిథి ఏకాదశి అయితే మాత్రం నాశన యోగం. లేదా- ఆ రోహిణీ శనివారం నందా తిథి అయివుంటే నిర్జీవయోగం. శుద్ధదశమీ శనివారం రోహిణీ నక్షత్రయుతమైనా, లేక, ఆరోజు శుద్ధత్రయోదశి అయినా అది క్రూర యోగం.

రోహిణితార పాపగ్రహగ్రస్తమయితే మహాశూల యోగం. చైత్రమాసం శూన్యయోగం.

## ప్రథమ రజస్వలా ఫలితః

ఈ రోహిణి తారలో ప్రథమరజస్వలయైన కన్య- అనేక సంతానవతి, పతివ్రత, ధనధాన్యాది సౌభాగ్యవతీ అవుతుంది.

## ఇతరాన్

సీమంతం, పుంసవనం, నామకరణం అన్నప్రాశనం, చౌలం, ఉపనయనం, వేదశాస్త్రాభ్యాసం, సమావర్తనం, వివాహం, తైలాభ్యంగం, నూతనభూషణధారణ, రాజ్యాభిషేకం, సింహాసనాధిరోహణం, అధికారస్వీకారం, పల్లకీనెక్కడం, నగర-గ్రామ-గృహ దేవతా ప్రతిష్టలూ, ఇతరేతర సమస్త వాస్తుకర్మలూ, యజ్ఞాలు, హోమాలు, దానాలు శాంతికృత్యాలు, పౌష్టిక కర్మలూ, ధనధాన్య సేకరణ, చెలివులూ—నూతులూ వగయిరాలు త్రవ్వించడానికీ ఈ తార అత్యంతోపయుక్తమవుతుంది.

## ఈ నక్షత్ర జాతకుల గుణగణాలు

చక్కటిస్వరూపం, సంభోగప్రియత్వం – తన్నిపుణత్వం, సామర్థ్యం, ధనికత, నేత్ర వ్యాధి, రవ్వంత పాదాంగలోపం, కాస్తంత పాపవాంఛ, స్ఫుటమైన చిన్న నుదురుకల వాళ్ళూ అవుతారు.

## పాదాంశాది వివరణం

ప్రథమపాదం కుజుడిది సేనాంశ-చాపల్యం, రాగి రంగు వెంట్రుకలు, శౌర్యం, దూషికత్వం లక్షణాలు.

ద్వితీయపాదం–శుక్రుడిది భృత్యాంశ–పొడగరితనం, ఓటమిని యిసుమంతకూడా అంగీకరించలేనితనం, మంచి శీలం కలవాళ్ళగుతారు.

తృతీయపాదము-బుధుడిది – విద్యాంశ-పండితులూ, కవులూ, గణితశాస్త్రజ్ఞులు, లోకవ్యవహారజ్ఞానులూ, అవు తారు.

నాలుగోపాదం చంద్రుడిది–అత్యాశ - ఇతరులధనాన్ని అపహరించేవాళ్ళూ, తెలివైనవాళ్ళూ అవుతారు.

ఈ రోహిణితారా జాతకుల జీవితం జననాదిగా చంద్ర మహాదశతో ప్రారంభం అవుతుంది. అది 10సంవత్స రాలు. అనంతరం కుజదశ.

ఈ జాతకులు పుట్టిన పది ఘటికలపైన అపమృత్యు భయంవుంది. అది తప్పినా–మూడు-పది దినాలలో అప మృత్యువుంటుంది. వాటి నధిగమించితే తొమ్మిదవయేట వాతజ్వరభయం, పదిహేడవయేట నేత్రరోగం కలుగు తాయి. ఇరవయ్యేడవయేట మేహరోగం ప్రాప్తిస్తుంది. యాభయ్యవయేట జ్వరపీడ డెబ్బయ్యవయేట అపమృత్యు భీతీ-ఆ గండం గడిస్తే–ఎనభై సంవత్సరాలపైన-యోగా యుర్దాయం వుంటుంది.

# మృగశిరతార

శివుడు చెబుతున్నాడు —

మృడానీ! ఈ తారని 'మృగశిర' అనీ 'మృగశీర్ష' అనీకూడా పిలుస్తారు. వే, వో, కా, కి - అనేవర్ణధ్వని స్పందన కలిగిన ఈ నక్షత్రం తెలుపురంగుతో శోభిస్తుంది. ఇది మూడు తారలకూడిక. కర్రలాగా, రాటలాగా, నిటారుగా వుంటుంది. శిరో (తల) ఆకృతికి కలిగివుంటుంది.

దీని లింగం నపుంసకం. గణం దేవగణం. యోని సర్ప యోని. జాతి బ్రాహ్మణజాతి. తిర్యఙ్ముఖం, మందలోచనాలు అంతర్ముఖలక్షణం. మండలం వాయుమండలం. స్థానం పట్టణం. అధివృక్షం చండ్రచెట్టు. అధిపక్షి కోడి. అక్షరస్వరం "ఇ" కారం.

గౌరీ! ఇది మృదుతార. దీని ఫలితాలు మంచికాని చెడుకాని-మెల్లమెల్లగా సంక్రమిస్తాయి.

పురహారీ మనోహారీ! షట్చక్రవర్తులలో ఒకడయిన పురూరవుడీ నక్షత్రంలోనే జన్మించాడు.

ఈ తారాది పధ్నాలుగు ఘడియల తదుపరి విషనాడి.

తీర్థయాత్రిలకు మేలు. మినుముతో కూడిన ఆహారం శ్రేష్ఠం.

తూర్పు, ఉత్తర దిక్కులకు ప్రయాణానికి ఈ తార శ్రేయస్కరం.

ఈనక్షత్రంలో జ్వరగ్రస్తులయినవాళ్ళకి 5 రోజులు కాని, ఒక నెలకాని అరిష్టదినాలు, ఆ శాంతినిమిత్తంగా—

తెల్లటి వర్ణం, తెల్లటి వాహనం, రెండు చేతులూ, ఆ రెండుచేతులలో ఒకటి అభయప్రదం-మరొకటి వరప్రదంగా వున్న విగ్రహాన్ని నిర్మించి—చంద్రుణ్ణి ఆవాహన చేయాలి.

'నమోనమోభవతి' అనే మంత్రపూర్వకంగా-షోడశోప చార పూజలూ చేయాలి.

తెల్లటివస్త్రాన్ని, తెల్లటి గంధాల్ని, కలువపుష్పాల్ని సమర్పించాలి. క్షీరాన్నాన్ని నివేదించాలి.

గాయత్ర్యాష్టోత్తర శతంతో-నేయీ క్షీరాన్నం కలిపి హోమం చేయాలి.

మంచిగంధాన్ని, మాల్యాన్ని, క్షీరాన్నాలనీ తూర్పు దిక్కులో బలిఅన్నంగా వుంచాలి-తద్వారా-అయిదురోజు లలో అరిష్టం తొలగిపోతుంది.

## వారయుక్త ఫలాలు

మృగశీర్షా తార ఆదివారమయితే దగ్ధయోగం. సోమ వారమయితేఅమృతసిద్ధియోగం మంగళవారం శుభయోగం బుధవారం ఆనందయోగం-గురువారం నాశనయోగం, శుక్ర వారం శుభయోగం-శనివారం వర్ధమానయోగం.

## తిధిసహితం

సోమవారం - మృగశిరాతార -షష్ఠితిథి అయితే విష యోగం—అష్టమీతిథి అయితే సర్వనాశనయోగం.

## ఉత్పాతాది

ఈ నక్షత్రంలో ఏ విధమైన ఉత్పాతాలు (తోకచుక్కలు వగైరా) కనిపించినా అతివృష్టి-ప్రజలకు అనారోగ్యం ఈ తారలో రవి సంక్రమణ జరిగితే-మధ్యమధరలు.

కార్తీకమాసం శూన్యయోగం. మృగశిరా తారవున్న రోజున ఉత్తరాషాఢా నక్షత్రం క్రూరగ్రహాగ్రస్తమైతే అది మహాశూలయోగం.

## ప్రథమ రజస్వలా ఫలం

ఈ నక్షత్రంలో ప్రథమరజస్వలయైన పడుచు ధనధాన్యవంతురాలూ, పుత్రసంతానవతీ అవుతుంది.

మన్మనోచారిణీ! పెళ్ళి, రజస్వలాముహూర్తం, నామకరణం, అన్నప్రాశన, చేలం, వడుగు, అక్షరాభ్యాసం, వేదశాస్త్రాదుల అధ్యయన ప్రారంభం, తైలాభ్యంగం, సర్వాభరణధారణ, పట్టాభిషేకం, గజతురగాధిరోహణం, పల్లకీ వాడకం, సమస్తమైన వాస్తుకర్మలూ, నూతన గ్రామ-నగర గృహ ప్రవేశాదులూ, వ్యవసాయారంభం, బీజావాపనం వగయిరా శుభకార్యాలకీ నక్షత్రం ప్రశస్తమైనదిగా తెలుసుకో.

## ఈ నక్షత్రంలో పుట్టినవాళ్ళ గుణగణాదులు

ఈ తారాసంజాతులు ఉత్సాహవంతులు, పాపకర్మలకి భయపడేవాళ్లూ, మాతృభక్తులూ, చిరకాల ఆయుష్మంతులూ, పీనవక్షులూ అవుతారు.

యోగం వికటిస్తే మాత్రం—అవివేకులూ, జనదూషితులూ, అంకుచిత భుజాలు కలవాళ్ళు, ఒక్కసారి యేదైనా చెబితే-దానిని మర్చిపోలేనివాళ్ళుగా వుంటారు.

## పాదాంశాదిః

మృగశిర్షా ప్రథమ పాదం రవిది—రాజాంశ-వీళ్ళు పెద్ద పనుల్ని-అంటే తలకుమించిన పనుల్ని నెత్తిన వేసుకుంటారు. ధనికులవుతారు. శత్రువుల్ని గెలుచుకునివస్తారు.

ద్వితీయపాదం -బుధుడిది - చండాశ యజ్ఞక్రియా క్రియులు, మంచివాచకం కలవాళ్ళూ, భోగులూ అవుతారు.

తృతీయపాదం శుక్రుడిది—అభయాంశ-

ఈ జాతకులు ఉదారవంతులూ, దేనికయినా సిద్ధపడే వాళ్లుగా వుంటారు.

చతుర్థపాదం-కుజుడిది—నీచాంశ

ఈ జాతులు పరజనద్వేషులు, కాముకులు, వుండ్లతో గూడిన తలగలవాళ్ళుగా వుంటారు. ఈ నక్షత్రంలో పుట్టిన వాళ్ళ జీవితం 7 సం॥ రాల ప్రమాణంగల కుజమహాదశతో ప్రారంభం అవుతుంది. అనంతరం రాహుదశ.

ఈ నక్షత్రంలో పుట్టినవాళ్ళకి—18 రోజుల లోపల గ్రహణాది ఉత్పాతాలు జరిగితే-మూడవయేట సర్పభయం 25వ యేట—అపనిందలు-స్థానభ్రష్టత్వం-50వ యేట భార్యా పుత్రాది వియోగం జరుగుతాయి. 81 యేళ్ళు వీళ్ళ పరమాయుర్దాయం.

# ఆరుద్ర

రుద్రాణీ ! శ్రద్ధగావిను—

కూ-ఖం-జ-చా-అనే అక్షరాలు ఈ నక్షత్రానికి ప్రతినిధులు. దీని వర్ణం ఎఱుపు, ఏకతార, స్త్రీలింగం, మనుష్యగణం, శునకయోని, అధిదైవతం రుద్రుడు, అధిపక్షం ఖాదిర(చంద్ర) చెట్టు, అధిపక్షి క్రౌంచం, స్వభావం ఉగ్రం ఊర్ధ్వముఖం, మధ్యలోచనం, వరుణముండలం, అర్ధతారాస్థానం, అకారక్షరస్వరం.

ఈ తారాది 21 ఘటికల తర్వాత విషనాడి. యాత్రాదులు విరమించాలి.

14 ఘటికల అనంతరం నువ్వులతో కూడిన భోజనం ఏర్పడుతుంది. (14 ఘటికలపైన చిమ్మిలితిని-ప్రయాణం చేయవచ్చునని కూడా పెద్దలు చెబుతున్నారు)

14 ఘటికల తర్వాత-ప్రయాణానికి శుభం.

ఈ నక్షత్రంలో ఏర్పడిన జ్వరం ప్రాణాంతకమవుతుంది మూడు నెలల పాటు అరిష్టాలపాలు చేస్తుంది. తత్ శాంతి నిమిత్తంగా—

త్రినేత్రుడు, తెల్లటి వర్ణం, తెల్లటి వస్త్రం, రెండు చేతులు, ఒకచేత త్రిశూలం, వృషభవాహనుడూ అయిన రుద్రుడిని ప్రతిమయందు ఆవాహనచేసి 'నమశ్శంభవే' అనే మంత్ర పూర్వకంగా షోడశోపచారపూజగా పూజించాలి

తెల్లటి గంధం, అగరు ధూపం, దుత్తూరపుష్పం, నివేద నార్థం శాల్యాన్ని ఉపయోగించాలి. అనంతరం–గాయత్రీ అష్టోత్తర శతయుక్తంగా–తేనె, నెయితో హోమం చేయాలి. గంధమాల్య పాయసాన్నాలను ఈశాన్యదిశలో 'బలి'గా వుంచాలి. శక్తిమంతులు తెల్లటి గోవుని దానం చేయాలి. తద్వారా ఆరుద్ర తారారిష్టాలు 1 మాసంలో తొలగి సుఖ సౌఖ్యాలు ఏర్పడతాయి.

## తిధి వార యోగ ఫలాలు

అచలకుమారీ! ఈ ఆరుద్రా నక్షత్రం ఆదివారంనాడు తటస్థపడితే మరణయోగం, సోమవారం సమకూడితే శుభ యోగం, మంగళవారమయితే మృత్యుయోగం, బుధవారం నాడు యమకంటకయోగం, గురువారం రంధ్ర యోగం శుక్రవారం శుభయోగం, శనివారం నిర్జీవయోగం, ఆనాటి ఆరుద్రా తృతీయ పాదం మృత్యుయోగం.

ఆ కాలానికి పూర్వాషాఢా నక్షత్రం క్రూర గ్రహా లతో కూడుకుని ఉన్నట్లయితే అది మహాశూలయోగం అవుతుంది.

పుష్యమాసంగాని, శూన్యమాసంలోగాని, ఆరుద్రా తారలో ఉత్పాతాలు కలిగితే–ప్రజలు ధాన్య క్షీరాభివృద్ధు లతో వర్ధిల్లుతారు. ఆకాశంలో ఇంద్రచాపాలేర్పడి చక్కటి వానలు పడతాయి.

ఈ నక్షత్రంలో రవి సంక్రమణం జరిగితే ధరలు సుమారుగా ఉంటాయి.

## రజస్వలా ఫలము

ఈ తారలో తొలివిడత రజస్వలయైన చెలువ-దరిద్రు రాలూ, అనేకమైన కష్టాలననుభవించేదీ అవుతుంది. ద్వితీయార్ధమందయితే - శాంతి జరపడం వలన శాస్త్రంత ఉపశమనం కలుగుతుంది.

## ఇతరాన్

శత్రుగ్రహణం, అగ్నిప్రయోగం, అక్షరస్వీకారం, అస్త్ర శస్త్ర విద్యాభ్యాసారంభం, దొంగతనానికి బయలుదేరడం, భూతగ్రహోచ్చాటనలు, మంత్రప్రయోగం, మంత్ర ప్రయోగం శివలింగ ప్రతిష్టకూ, తీర్ధాటనకీ, శ్రాద్ధ కర్మలకీ -ఆరుద్ర-ప్రశస్తమైన నక్షత్రం.

## జాతగుణాగణాదీన్

ఈ నక్షత్రంలో జన్మించినవాళ్ళు గుణవంతులూ, ఆచారవంతులుగా ఉంటారు. కొనుగోలు అమ్మకాల విషయంలో నేర్పరులవుతారు. గర్విష్ఠులూ, పాపకర్మానరక్తులూ, విశ్వాసఘాతకులు, అధిక ఆయుర్దాయం కలవాళ్లుగా వుంటారు.

## పాదాంశాదిః

ఆరుద్రా తార ప్రథమపాదం గురుడిది. కృపాంశ—ఈ అంశలోజన్మించినవాళ్ళు గుణవంతులు,నిత్యం,ప్రశాంతంగా వుండే చక్కటి ముఖం కలవాళ్ళూ. తామున్నరంగంలో నేర్పరులూ అవుతారు.

ఈ నక్షత్ర ద్వితీయపాదం శనిది. తస్కరాంశ-ఈ జాతకులు కలహప్రియులు, దొంగలు, అతిదాహంకలవాళ్లూ హీనమైన కంఠస్వరం కలవాళ్ళుగా వుంటారు.

మూడవపాదంకూడా శనిదే. కాని—ఇది ఉగ్రాంశ:- అందువల్ల వీళ్ళు-పాపకర్మరతులు, చెడు ఆలోచనలు చేసే వారూ, స్థిరమైన ధనం లేనివారూ (అంటే ఏవో జల్సాలకీ షికార్లకీ మాత్రమే ఆర్థిక ప్రతిపత్తి కలవారూ,) శుచి శుభ్రతలు లేని మలినవంతులుగా వుంటారు.

చతుర్థపాదం బృహస్పతిది. ఇది ఉత్కృష్టాంశ—ఏత ద్వేళా సంజాతులు ధర్మాత్ములవుతారు. చక్కటి ఆచార వంతులవుతారు సమస్తమైన సద్గుణాలనూ స్వీకరించేవారూ, గౌరవించేవారూ అయివుంటారు.

ఆరుద్రలో పుట్టినవారి జీవితం రాహుమహాదశతో ప్రారంభమవుతుంది, ఇది 18 సంవత్సరాలుంటుంది అనంత రం గురుమహర్దశ ఆరంభమవుతుంది.

ఈ జాతకులకు జననాది అయిదవయేట తొమ్మిదో నెలలో అపమృత్యుభయం కలుగుతుంది. అతిక్రమిస్తే 16వ యేట వాతరోగం, వాయుపీడ, అగ్నిభయం కలుగుతాయి, అధిగమిస్తే 24వ యేట సర్పగండం, 40వ యేట నాలుగు కాళ్ళ జంతువులవలన భయం, 59వ సంవత్సరం అపమృత్యు భయం వుంటాయి.

దేవీ! ఏ సంవత్సరంగానీ—సూర్యుడు కుంభరాశిలో

మనకే (మాఘ-ఫాల్గుణ) మాసంలో— శుద్ధపంచమీ తిథి, ఆదివారం, ఆరుద్రానక్షత్రంతో జతపడితే – పైత్యవికారం వలన అపమృత్యువు పాలయ్యే ప్రమాదం వుంది. ఇలా గండాలు గడుచుకుంటూ పోగాపోగా, 70వ పడివరకూ వీళ్ళకు పరమాయుర్దాయం వుంటుంది.

# పునర్వసూ నక్షత్రం

కే, కో, హా,హీ, అనే అక్షరాలతో ప్రారంభమయ్యే పేర్లు గలవాళ్ళు ఈ నక్షత్రజాతకులుగా పేరుపడతారు.

ఈ నక్షత్రం 5 తారల సమ్మేళనం. కృష్ణవర్ణంలో విరాజిల్లేపుంలింగ నక్షత్రం. దేవగణం. మార్జాల(పిల్లి) యోని. వైశ్యజాతి, పార్శ్వముఖం, సులోచనం, చారతాగుణం, పట్టణ స్థానం, వాయుమండలం, అధివృక్షం వెదురు. అధి పక్షి హంస, అధిదైవతం అదితి.

దేవతల సర్వవాంఛల్నీ తీర్చే 'సురభి' ఈ తారలోనే సంభవించింది.

చక్రాకారంగా త్రిపాత్తుగావుండే ఈ తారముప్ఫయి ఘటికల అనంతరం విషనాడి. పాలు లేదా మంచినీళ్ళు మాత్రమే ఆహారంగా తీసుకుంటూ చేసే ప్రయాణాలకిది మంచిది.

## జ్వరాదీన్

ఈ పునర్వసూ తారాలో వ్యాధిగ్రస్తులయిన వారికి 7రోజులపాటు అరిష్టం యేర్పడుతుంది. ఆ అరిష్టశాంత్యర్థం-

నల్లనిరంగు కలదీ, నాలుగు భుజాలుకలదీ, అక్షసూత్ర కమండులువులను ధరించినదీ, గుఱ్ఱం వాహనం పైవున్నదీ అయిన అదితీ విగ్రహాన్ని నిర్మించి- దానికి ప్రాణ ప్రతిష్టాపనా కళాన్యాసాదులూ- ఆవాహనం చేసి-'అదితిర్జాత' అనే మంత్రయుక్తంగా షోశోడపచారాలతో నూపూజించాలి. ముఖ్యంగా ఈ పూజలో పీత (బంగారు రంగు) వస్త్రాన్ని, కుంకుమగంధం, మల్లికాపుష్పాలు, మలయజ ధూపం, వినియోగించాలి. గుడాన్నం (బెల్లంతో కలిపిన, లేదా కలిపి వండిన అన్నం) నివేదించాలి.

గాయత్రీ అష్టోత్తరశత సహితంగానువ్వులూ,బియ్యం నెయ్యితో-హోమం చెయ్యాలి గంధమాల్య గుడోదనా (బెల్లంతో కూడిన అన్నా)లతో ఉత్తర దిశలో 'బలి' నుంచాలి. ఉపరివిధంగా శాంతి చేయడంవలన వారం రోజులలో స్వస్థత కలుగుతుంది.

## తిథివారయోగ ఫలాదులు

ఈ పునర్వసు నక్షత్రం ఆదివారంనాడు వస్తే సిద్ధ యోగం-సోమవారమయితే శుభయోగం- మంగళవారం మరణయోగం-బుధవారం సందాముహూర్తవేళకు అమృత యోగం- గురువారం అమృతయోగం- శుక్రవారం నాశన

యోగం_శనివారం శూలయోగం.

సప్తమీతిథితోకూడిన పునర్వసుతార-శూలయోగం

ఈ పునర్వసునక్షత్రం వచ్చినరోజునమూలానక్షత్రం పాపగ్రహ సంచారంలోవుంటే-అది మహాశూలయోగం.

జ్యేష్టమాసాది శూన్య మాసాలలో- పునర్వసూ తారాయుక్త దినాల్లో ఉత్పాతాలు కనుపించితే- ప్రజలకు వాయుపీడా, వాయువుల వలన హానీ కలుగుతుంది.

ఈ పునర్వసూ తారలో రవిసంక్రమణం జరిగితే- ధరలు మధ్యస్థంగా వుంటాయి.

## ప్రధమరజస్వలాదీన్

ఈ పునర్వసు తారలో ప్రథమరజస్వలయైనపడుచుది చెడుమార్గాలలో చరించేది, చెడుగా ప్రవర్తించేదీ ధన నాశన కారిణీ అవుతుంది.

## ఇతరాన్

పుంసవనం, సీమంతం, నామకరణం, అన్నప్రాశన, చెవులు కుట్టించడం, చౌలం, ఉపనయనం, అక్షరాభ్యాసం, వేదశాస్త్రాద్యభ్యసనారంభం, తైలాభ్యంగం, చిత్రవస్త్రాభరణాది ధారణం,పట్టాభిషేకం,సింహాసనారోహణం,నూతన శయ్యారోహణం, అగ్రహారగ్రామాదిక సమస్తవాస్తుకర్మ ప్రారంభం, గృహప్రవేశం, యాత్రలు, వైద్యారంభం, ఇత్యాది శుభకార్యాలకు ఈ తార ప్రశస్తమైనది.

## ఈ నక్షత్రంలో పుట్టినవాళ్ళ గుణగణాలు

ఈపునర్వసూ తారలోపుట్టినవాళ్ళు భోజనప్రియులు, సత్యవాదులూ, మంచిగుణాలుకలవాళ్ళూ, ఉత్సాహవంతులు త్యాగశీలులు, వైభవోపేతులు, హాస్యప్రియులు, హీనమైన కంఠస్వరం కలవాళ్ళూ, బుద్ధిమంతులుగా వుంటారు.

## పాదాద్యంశఫలాః

పునర్వసూ ప్రథమ పాదం కుజుడిది- ఉత్తమాంశ- ఈ జాతకులు దేవబ్రాహ్మణ భక్తి తత్పరులవుతారు. ఎఱ్ఱటి కళ్ళుంటాయి. కాని, కుత్సితబుద్ధి వుంటుంది.

రెండవ పాదం శుక్రుడిది—భోగాంశ—ఈ అంశాజాతులు వస్త్రాలంకారవంతులూ, క్షీరాన్న భోజనప్రియులు, ధనికులూ అవుతారు.

తృతీయ పాదం బుధుడిది-సౌమ్యాంశ-వీళ్ళు కాముకులు, లోభులు, చిరాయుష్మంతులు, అయినప్పటికీ స్వల్ప రోగవంతులు—లేదా-తరచు వ్యాధిపీడితులుగానో వుంటూంటారు,

నాలుగవ పాదం చంద్రుడిది-ధనాంశ - ఈ జాతకులు తేజస్వులు, సర్వజనులకూప్రియంచేసేవాళ్ళూ, ధనవంతులూ అవుతారు.

ఈ పునర్వసూ నక్షత్ర జాతకులకు 16 సం॥ల ప్రమాణం కలిగిన గురుమహాదశతో జీవనారంభమవుతుంది. తదుపరిది శనిదశ. అది 19 సంవత్సరాలు.

వీళ్ళకి జననాదిగా పది రోజులు అరిష్టం. మూడు సంవత్సరాలపాటు నేత్రరోగ ప్రమాదం. అయిదవ సం॥రం

(నుంచి)లో శత్రుభయం. ఏడవయేట తల్లికి అనారోగ్యం లేదా చర్మవ్యాధులు; పదహారవ సంవత్సరంలో అపమృత్యు భయం, 25 సంవత్సరాల వయసులో సర్పభయం, నలభయి మూడవయేట నాలుగుకాళ్ళ జంతువులవలన భయం. 52వ యేట పుత్రహాని - 80వ సంవత్సరంలో భూమిమీద ఉండే ముండ్లవలన భయం—

ఈ శాస్త్రీయాంశాలలో కీలకమైనదేమిటంటే - ఆదివారం పంచమీ తిథి వచ్చిననాడు - సూర్యోదయాది 14 ఘటికల పర్యంతం ప్రమాదకరమే !—

ఈ విధంగా అన్ని గండాలనీ గడిచి మిగిలితే-99 సం॥ ఆయుర్దాయము.

# పుష్యమి

ఈ పుష్యమీ నక్షత్రం తెల్లని రంగులో వుంటుంది. సరటాకారం. పురుషలింగం దేవగణం - చంద్రతార- మేషయోని - క్షత్రియజాతి - చతుష్పాత్తు - అధోముఖం - అంధలోచనం - అతిశీఘ్ర ఫలప్రదం - బాహ్యం - గ్రామవాసం- అగ్ని మండలం -

అధిదైవం బృహస్పతి, అధివృక్షం అశ్వత్థం, అధిపక్షి జలకాకం, స్వరం అకారాక్షరం, తారోదయాది 20 ఘటికల అనంతర విషవాడి.

ఈ తారలో యాత్రలు చేసేవాళ్ళు క్షీరాన్నాన్ని భుజించాల్సి వస్తుంది,

ఏదిక్కుకు ప్రయాణించినా ఈ తార శుభఫలాన్ని స్తుంది,

## జ్వరాదీన్

ఈ నక్షత్రంలో జ్వరపడిన వారికి 7 దినాలు అరిష్టం. శాంతి నిమిత్తం - నాలుగు చేతులూ, ఆ నాలుగు చేతులందునా అక్షసూత్రకమండువులూ — వరదముద్రా ధరించి వున్నట్లుగానూ, బంగారపు రంగు పట్టుబట్టకట్టుకున్న బృహస్పతి విగ్రహాన్ని నిర్మించి - ఆయన నా ప్రతిమకి ఆవాహనం చేసి,

"బృహస్పతే"...అనే మంత్రాదిగా షోడశోపచార పూజలూ చేయాలి, ఈ పూజలోకి ఎర్రతామర పూవుల్నీ, చంద్రధూపాన్నీ, కుంకుమ గంధాన్నీ ఉపయోగించాలి. దద్ధోజనాన్ని నివేదనగా సమర్పించాలి. పూజానంతరం శ్రీ గాయత్ర్యష్టోత్తరశత సహితంగా క్షీరాన్నంతో హోమం చేయాలి. ఆ పిదప గంధమాల్యక్షీరాన్నాలను ఉత్తర దిశలో బలిగా వుంచాలి.

ఉపరిప్రోక్త శాంతి కార్యంద్వారా-వ్యాధిబాధితులు 7 దినాలలో కోలుకుంటారు. అరిష్టాలు తొలగుతాయి.

## తిధివార యోగఫలాలు

ఆదివారం పుష్యమీనక్షత్ర యుక్తమైతే అపమృత్యు యోగం.

సోమవారం యమఘంటక యోగం

మంగళవారం స్థిర యోగం

బుధవారం ఆనందయోగం

గురువారం శుభయోగం

శుక్రవారం నాశనయోగం

శనివారం మరణ యోగం

శుక్లపక్ష అష్టమీ తిథినాడు పూర్వాషాఢా నక్షత్రం గ్రహ రహితమై, జ్యేష్ఠానక్షత్రం క్రూరగ్రహ సంయుతమై, వుండి, ఆనాడు పుష్యమీతార వచ్చినట్లయితే అది మహా శూలయోగం.

వైశాఖం శూన్యమాసమై - ఆ నెలలో పుష్యమీ తారలో ఉత్పాతాలు కనిపించినట్లయితే కరువు కాటకాలు, అగ్ని భయం కలుగుతాయి

ఈ పుష్యమీ తారలో రవి సంక్రమణం యేర్పడితే సరసమైన ధరలుంటాయి.

## ప్రధమ రజస్వలా ఫలాదీని

పుష్యమీ తారలో తొలిసారిగా వ్యత్తురాలయిన పాలతి - పతివ్రత, పుత్రవతీ అవుతుంది.

## ఇతరాన్

ఋతుకాల, పుంసవన, సీమంత, నామకరణ, అన్నప్రాశనం, చౌలం, ఉపనయనం, చెవులు కుట్టించడం, క్షురకర్మ, ఖడ్గధారణం, వేదశాస్త్రాభ్యాసారంభం, సేవకుల్ని పనిలో చేర్చుకోవడం, పశువుల్ని తెచ్చుకోవడం, వ్యవసాయారంభం

యాత్రారంభం, వైద్యారంభం, నూతనాభరణ ధారణం, రాజ్యాభిషేకం, సింహాసనారోహణం, పల్లకీ నెక్కడం, అశ్వారోహణం, అశ్వగ్రహణం, సమస్త వాస్తుకర్మలూ, నూతనంగా గ్రామాలలో పట్టణాలలో ప్రవేశాలకు, యజ్ఞారంభం, వ్రతారంభం, ఉపదేశం పొందడం, నృత్యాభ్యాసారంభం, నాగవల్లీ- చెరుకుతోటల సేద్యారంభానికీ — ఈ పుష్యమితార అత్యంత అగ్రగణ్యంగా ఉంటుంది.

## పుష్యమీ జాతక ప్రశంసా

పుష్యమీ నక్షత్రంలో పుట్టినవాళ్ళు సర్వజ్ఞులు, మేధావులు, శీఘ్రకోపులు, జ్యోతిషాది శాస్త్రవేత్తలు, ధైర్యవంతులు, బంధువర్గాలకు అత్యంత ఉపకారులు, తీపి వస్తువులందు వాంఛ కలవాళ్ళూ, నీలంరంగు అందమైన కళ్ళు కలవాళ్ళూ, అభిమానవంతులు, సూక్ష్మమైన గుహ్యం కలవాళ్ళూ, ఏకాంత ప్రియులు, చేతులలోనూ-అరికాళ్ళలోనూ మత్స్యాంకితాలున్న వారూ, దీర్ఘాయుష్మంతులూగా ఉంటారు.

## పాదాంశాది

పుష్యమీ ప్రథమపాదం రవిది, భూపాంశ - ఈ వేళా సంజాతులు- ఏకాకులుగా వుంటారు. ఏ పనినైనా అతి చురుగ్గా నిర్వర్తిస్తారు. స్థూలకాయులుగా వుంటారు.

ద్వితీయ పాదం బుధునిది. సౌమ్యాంశ-వీళ్ళు పర స్త్రీరతులు, ధన కాంక్షులు, స్నేహపరంగానూ - పర స్త్రీ వాంఛాపరంగానూ కష్టాలు పొందుతారు.

మూడో పాదం శుక్రుడిది. శూరాంశ-చాలా ప్రసన్నంగా వుంటారు. భోగవంతులూ-నిత్యం మనశ్శాంతితో అలరారేవారుగా వుంటారు.

నాలుగో పాదం కుజుడిది. నీచాంశ-ఈ వేళా ప్రభూతులు_ఇతరుల ద్రవ్యాన్ని అపహరించేవాళ్ళు, కలహ ప్రియులుగా వుంటారు.

మొత్తంమీద పుష్యమీ తార ఏ పాదంలో జన్మించినా వారి జీవితం-19 సం॥ల నిడివి గల శని మహాదశతో ప్రారంభమవుతుంది. తదుపరిది బుధమహాదశ. ఇది 17 సంవత్సరాలు.

జననాది మొదటినెల చివరిలో మరణ సూచన వుంటుంది. 13-లేదా-16 సంవత్సరాల వయసులో అగ్నిప్రమాదం. 21వ యేట వాతజ్వరపీడ. 27వ యేట ఆయుధాల వలన ప్రమాదం కలుగుతుంది. 64 వ యేట అపమృత్యువు. అన్నీ గడిచి గట్టెక్కితే 70వ పడి వరకూ పరమాయువు వుంటుంది.

# ఆశ్లేష

భవానీ! ఆశ్లేషా తార ఎఱ్ఱని రంగులో అలరారు తూంటుంది, ఆరు తారల కూడికతో సర్పాకారంలో విరాజిల్లుతుంది. ఇది స్త్రీ తార. రాక్షసగణానికి చెందింది. మార్జాల యోనికి చెందింది. ఛండాల జాతీయం. చతుష్పాత్తు. అధోముఖ తార. మందలోచనం. క్రూరస్వభావం కలది. బాహ్యం, అర్ధతారాస్థానం, వరుణ మండల గతం. అధివృక్షం పున్నాగచెట్టు. అధిపక్షి టిట్టిభం. అధిదైవతం సర్పం, అంత్యనాడి.

ఈ నక్షత్రం 32 ఘటికోపరివిషనాడి కావడంవలన ప్రయాణాలకూ, యాత్రలకూ మంచిది కాదు. ఈ తారాచారవేళ పాయసాన్న భోజనం మేలు. ప్రయాణికుల ఇతరేతర జాతక, దశా, అవసర బలాబలాలననుసరించి తూర్పు - ఉత్తర దిక్కులవైపు ప్రయాణాలకి ఈ తారకి ఎంపిక చేస్తూ వుంటారు.

ఆశ్లేషా తారలో వ్యాధి గ్రస్తులకు ప్రాణగండం. ప్రాణాపాయం తప్పినా ! నెలపాటు అరిష్టయోగం. తచ్ఛాంతి నిమిత్తంగా—పసుపూ- తేనెరంగూ కలగలిసిన సర్పదేవతా ప్రతిమను చేసి-

"నమో సర్పేభ్యః" అనే మూల మంత్రంతో సర్పదైవాన్ని ఆ ప్రతిమలోకి ఆవాహన చేసి-షోడశోపచారాల

తోనూ ఆరాధించాలి. ఈ పూజలో కుంకుమ గంధాన్నీ, పసుపురంగు వస్త్రాన్నీ, ఎర్రని పువ్వుల్నీ, నెయ్యి-గుగ్గిలం కలిపిన ధూపాన్నీ వినియోగించాలి. క్షీరాన్నం నివేదించాలి పూజానంతరం గాయత్ర్యష్టోత్తర శత సహితంగా పాయసాన్నంతో హోమం చేయాలి. గంధమాల్య క్షీరాన్నాలను తూర్పు దిశలో బలి వేయాలి. ఎఱ్ఱటి గోవును దానంచేయాలి తద్వారా మాసారిష్టాలు తొలగిపోతాయి.

## తిధివార యోగఫలాని

ఆశ్లేషా ఆదివారం - చరయోగం
సోమవారం - విష యోగం
మంగళవారం - ఆసురీ యోగం
బుధవారం - యమకంటక యోగం
గురువారం - సిద్ధయోగం
శుక్రవారం - మరణ యోగం
శనివారం - మృత్యుయోగం

ఆశ్లేషా నక్షత్రం వున్ననాడు ధనిష్ఠా నక్షత్రం క్రూర గ్రహాలతో కూడివుంటే అది మహాశూలయోగం అవుతుంది. ఆశ్వయుజం శూన్య మాసమయితే - సర్ప గండం లేదా, అకాలమరణం ప్రమాదాలు. ఆ శూన్యాశ్వీయుజంలో ఆశ్లేషా నక్షత్రంవున్న రోజున ఏవైనా ఉత్పాతాలు తారసిల్లితే-అది ప్రజలకి శుభం. ప్రజలు- అధిక పాడి పంటలతో వర్ధిల్లుతారు.

రవి సంక్రమణం ఆశ్రేషా తారలో జరిగితే - ధరలు మధ్యమంగా వుంటాయి.

## ప్రథమ రజస్వలాది

ఆశ్రేషా నక్షత్రంలో అది సమావర్తనం జరిగిన ఆడపిల్ల భర్తలేనిదీ, చెడు మార్గాల్లో మనలేదీ, చెడు ప్రవర్తన కలదీ అవుతుంది.

## ఇతరాని

అభిచార- విష- అగ్ని ప్రమాదాలకీ, యుద్ధయాత్రకీ ప్రతిబంధ విమోచనానికీ, అసత్యవాదాలకీ, అస్త్ర శస్త్రాభ్యాసాలకీ, మాయా ప్రయోగానికీ- వాపీకూపతటాకాల ప్రారంభోత్సవాలకీ ఆశ్రేష మంచిదిగా పరిగణించబడింది.

## ఆశ్రేషా జాతక లక్షణాలు

డీ, డూ, డే, డో, అనే అక్షరసంజ్ఞలు తొల్లిట గలిగిన పేర్లు కలవాళ్ళంతా ఆశ్రేషా జాతులుగానే పరిగణింపబడుతున్నారు. అలా లేక పోయినా పాండవాగ్రజుడయిన ధర్మరాజు ఈ తారలోనే ప్రభవించాడని చెబుతారు. కాని ఆయనది జ్యేష్ఠానక్షత్రమని కొందరి వాదన.

సాధారణంగా- ఈ నక్షత్ర సంజాతులు_ వాగుడు కాయులు, రాజగౌరవం పొందే వాళ్లూ, చూపువాసిపొట్టి

వాళ్లూ (తమని తాము తక్కువగా యెంచుకునే వాళ్లూ,) కోపభూయిష్ఠమైనకళ్ళు గలవాళ్ళూ ఇతరేతరప్రాంతాలలో నివసించేవారూ, భయంకలిగించే మాటలు కలవారూ, తమ యజమానుల పనులు చేయడంలో నేర్పరులూ, కాముకులూ, పొట్ట-తల భాగాలలో పుట్టుమచ్చలూవగయిరా తిలకాదులు కలవారూ, ఋజు ప్రవర్తకులూగా వుంటారు.

## పాదాంశాదిః

ఆశ్లేషా ప్రథమ పాదం గురుడిది. ఉత్పన్నాంశ. ఈ అంశా జాతులు ధైర్యవంతులు, సత్యవాదులు, మంచిబుద్ధి కలవారూగా వుంటారు.

ద్వితీయ పాదం శనిది-పాపాంశ. వీళ్ళు నిత్యం వ్యాధిగ్రస్తులు, పాపకార్యాసక్తులు, చంచల స్వభావులు, నీచమైన పనుల ద్వారా డబ్బు సంపాదించేవారూ, శుచిశుభ్రాలు లేనివారూ అవుతారు.

తృతీయ పాదంకూడా శనిదే. ఇది క్రోధాంశ-అబద్ధాలాడడం, కుట్రలు చేయడం, అన్యాయంగా డబ్బు సంపాదించడం, బుద్ధిమాంద్యం, వాతరోగం వీళ్ళ లక్షణాలు.

నాలుగో పాదం గురుడిది. కాని, ఉగ్రాంశ. ఈ వేళా ప్రభాతులు మాతాపితరులకి మారక కారకులవుతారు. ధన నాశకులు, పరుల పెంపకంలో వుండేవారూ, ఏదో నామ్‌కే వాస్తే సుఖపడేవాళ్ళుగా వుంటారు.

ఈ తార చివరి రెండు ఘటికల కాలం "అభుక్త గండం"గా వర్ణించబడింది.

ఆశ్లేషా నక్షత్ర జాతకులకు జననాది - మొదటి సంవత్సరం జ్వరభయం, నాలుగో యేట పశువుల వలన భయం, ఎనిమిదవ యేట అగ్ని వలనా - విషం వలనా భయం, పదకొండవయేట అంగవైకల్య భయం, లేదా, అగ్ని - ఆయుధం జ్వరాల వలన పీడ, 27 వ యేట సర్పభయం, 30 వ యేట రుద్రవాత భయం, 63వ యేట అపమృత్యుభయం అధిగమించితే 86 సంవత్సరాలు పరమాయువు.

ఆశ్లేష నక్షత్రంలో జన్మించిన వారిజీవితం 17 సం॥ల నిడివి గల బుధ దశతో ఆరంభమవుతుంది. తదుపరిది 7 సం॥ కేతుదశ.

## మఖ

దీనినే "మఘ" అనికూడా అంటారు.

కృష్ణవర్ణ యుతమై, అయిదు తారల కూడికతో పల్లకీ ఆకారంలో భాసిస్తూ వుంటుంది. పురుషలింగం-రాక్షస గణం. మూషిక (ఎలుక) యోని, శూద్రజాతి, చతుష్పాత్తు, అధోముఖ, మధ్యలోచన, ఉగ్ర స్వభావి, స్థానం పట్టణం, అగ్ని మండలం, అధిపక్షి వాయసం (కాకి), అధివృక్షం వట (మర్రి) వృక్షం, అధిదైవం పితృదేవతలు, పంచాక్షర స్వర యుతం.

ఈ ఋక్షారంభాత్ రెండు ఘటికల అనంతరం మృత్యు

లకు సంబంధించిన ఆహార ప్రాప్తి. ముప్పయి ఘటికల అనంతరం విషనాడి. ఆ సమయంలో యాత్రలు చేయకూడదు. ఇతరవేళల్లో చేయవచ్చును, పడమర ఉత్తరదిశలుగా ప్రయాణాలకీతార మేలు,

ఈ తార యొక్క మొదటి పాదంలో జ్వరగస్తులయితే 15 రోజులు, రెండవ పాదమందయితే 7 రోజులు, మూడవ పాదములో అయితే 17 రోజులు, నాల్గవ పాదంలో నలతచేస్తే 20 రోజులు అరిష్ఠ ప్రదాలు. తత్ శాంతికై దిగువ విధంగా చేయాలి.

## అథ మఖతారా శాంతి జపమంత్రః

మంత్రము:- ఓం హౌం ఓం జూంసః - భూర్భువస్వః

త్ర్యంబకం యజామహే
సుగంధిం పుష్టి వర్ధనం
ఉర్వారుక మివ బంధనాత్
మృత్యోర్ముక్షీయ మామృతాత్। భూర్భువస్వః
ఓం జూం సః హౌం ఓం॥

పై మంత్రమును పదివేలసార్లు జపించికాని, జాపకుల నుండి ఫలమును గ్రహించి గాని - అనంతరము - దిగువ విధముగా శాంతి పూజ నాచరించవలెను,

## శాంతి పూజా విధిః

ఈ నక్షత్రంలో జ్వరపడటం ప్రాణహాని.

కృష్ణవర్ణం, చతుర్భుజం, నాలుగు చేతులలోనూ మూడింట అక్షసూత్ర కమండులువుల్నీ కలిగి, నాలుగో చేత వరప్రదానముద్రతో అలరారే-నీలి (నల్లని) వస్త్రాలంకృత మైన పితృ దేవతా విగ్రహాన్ని నిర్మించి, ప్రాణప్రతిష్ఠా వాహనాదులన్నీ నెరవేర్చి, "ఉదీరత" అనే మంత్రంతో-షోడశోపచార విధిగా ఆరాధించాలి, ఈ పూజలో కృష్ణా గురు గంధాన్నీ, సంపెంగ పుష్పాల్నీ, నేతితో కూడిన గుగ్గులం ధూపాన్నీ ఉపయోగించాలి. నేతితో కూడిన ఆవు పాల్ని నైవేద్యంగా వినియోగించాలి.

పూజానంతరం గాయత్ర్యష్టోత్తరశత సహితంగా నువ్వులూ, బియ్యం, నేయితో హోమం వేయాలి. గంధ మాల్య క్షీరాన్నాలను ఉత్తర దిశలో "బలి" వేయాలి. తద్వారా 21 దినాలలో అరిష్టాలు తొలగి ఉపశమనం యేర్పడుతుంది. నల్లని ఆవును దానం చేయాలి.

## తిథివారయోగ ఫలాదీన్

మఖా నక్షత్రం ఆదివారంనాడు కూడివస్తే-
అది సిద్ధయోగం

సోమవారంనాడు వస్తే - మృత్యుయోగం

మంగళవారమయితే – శుభయోగం

బుధవారం – మరణయోగం

గురువారం – సిద్ధయోగం

శుక్రవారం – రంధ్రయోగం

శనివారం – విషయోగం

రిక్త తిథులలో–నిర్జీవ యోగం.

పంచమీతిథినాడు మఖా నక్షత్రం పడితే –
అది జ్వాలాముఖియోగం

మఖా నక్షత్రంనాడు- భరణీ నక్షత్రం క్రూర గ్రహాక్రాంతమయితే అది మహా శూలయోగం

కార్తీకమాసంలో – శూన్యయోగం

ఈ నక్షత్రంలో ఉత్పాత దర్శనం వలన –
కరువుకాటకాలు, అగ్ని భయం కలుగుతాయి

మఖా నక్షత్రంలో రవి సంక్రమణం జరిగితే –
మధ్యమ తరహా ధరలు పలుకుతాయి.

## ప్రథమ రజస్వలా ఫలం

మఖా నక్షత్రంలో ప్రథమ రజస్వలయైన కన్య నిత్య దుఃఖితురాలవుతుంది. ఉత్తరార్థంలో అయితే, తప్పనిసరిగా నవవిధ శాంతులూ జరిపించుకోవాలి.

## ఇతరాన్

సమావర్తనం, వివాహం, అన్నిరకాల మంత్రప్రయోగాలు, వాపీకూపతటాక నిర్మాణాలు, గయాశ్రాద్ధ కాండ, పితృతర్పణం—ఇత్యాదులకీ నక్షత్రం శ్రేష్టతమమైంది.

## మఖా నక్షత్ర జాతకుల విషయం

తమ పేరు ముందర మా, మీ, మూ, మే అనే ఏ అక్షరమున్నా— వారిపై ఈ తారా ప్రభావం వుంటుంది,

ఈ ఋక్షజాతులు-విద్వాంసులు, వినయ వంతులు, ధనవంతులు సర్వకార్య నిపుణులు, బంధువర్గాలకు ఉప కారాలు చేసే వాళ్ళు చండీ_దుర్గా-ఇత్యాది మాతృకల-లేదా దేవీసంజ్ఞలయందు భక్తియుతులు. ఇతరుల్ని వశీకరణం చేసుకోడంలో నేర్పరులు, శీఘ్ర కోపిష్టులూ, భార్యారతులు, కాముకులు, శిల్పకర్మలు చేయడంలో మగ్నులు అయి వుంటారు. నిత్యరోగులు, కటిదిగువ భాగాలలో తిలుకాదులు కలవాళ్ళుగా వుంటారు.

## పాదాంశాది ఫలాని

మఖా - ప్రథమ పాదం - కుజుడిది - సేవాంశ - ఈ జాతకులు శరీరంపై ఎఱ్ఱని రోమాలు కలవాళ్ళూ, బలిష్టమైన పట్టుదల కలవాళ్ళూ, పింగళాక్షులు, ప్రతిష్ట కలవాళ్ళుగా వుంటారు,

ద్వితీయ పాదం శుక్రుడిది. భుక్తాంశ. ఈ జాతకులు ఏకాంత ప్రియులు, త్యాగశీలురు, దేనినైనా న్యాయంగా సంపాదించాలనే దృక్పథం కలవాళ్ళుగా వుంటారు.

తృతీయ పాదం బుధుడిది - విచక్షణాంశ - ఈ పాదాంశా ప్రాభవులు - జ్ఞానులు, మేధావులు, నేర్పరులూ అవుతారు.

నాలుగో పాదం చంద్రుడిది_ అంత్యాంశ - వీళ్ళు స్త్రీ ప్రియులు, అంతర్రోగులూ, తెలివైనవాళ్ళే - కాని కుటిల స్వభావులు, పోట్టివారూ అవుతారు.

మఖా నక్షత్ర జాతకుల జీవనం - 7 సం॥ల నిడివి గల కేతు దశతో ఆరంభ మవుతుంది. తదుపరిది శుక్ర మహాదశ 20 సంవత్సరాల వ్యవధి.

ఈ జాతకులకు జననాది 68 నెలలో పుండ్లవలన పీడ కలుగుతుంది. షణ్మాసాని (18 నెలల)కి ఆయుధాలవలనా, అగ్ని వలనా ప్రమాద సూచనలున్నాయి. అయిదవయేట కాని, యేడవయేట కాని వాత-లేదా-పిత్త-జ్వరాల భయం. ముప్ఫయ్యో యేట వాతగుల్మక్రిమి పీడ. 64-68 సంవత్స రాలలో జ్వరం వల్లనో, ఆయుధాల వల్లనో అపమృత్యు ప్రమాదం వుంటుంది. అన్నీ అధిగమించితే 79 సం॥లు పర మాయువుగా వుంటుంది.

# పూర్వాఫల్గుణి

## ( పుబ్బ )

మంచు అాచూలీ! పూర్వాఫల్గుణీ తారను-'పుబ్బా' నక్షత్రంగా వ్యవహరిస్తుంటారు. ఇది తెల్లని రంగుగల తార, రెండు చుక్కలు దండాకారంలో ప్రకాశిస్తుంటాయి. స్త్రీ లింగ తార. మనుష్యగణం మూషిక (ఎలుక) యోని. బ్రాహ్మణ జాతి. చతుష్పాత్తు. సులోచనం. అంతర్ముఖి. సమతార, ఆవాసం గ్రామం, మండలం అగ్ని. అధిపక్షి గ్రద్ధ. అధివృక్షం పాలాశం (మోదుగ) అధిదైవం భర్గుడు (శుక్రుడు).

ఋక్షారంభాది 20 ఘడియలపైన విషనాడి. అది ప్రయాణాలకు తగదు.

ప్రారంభాది పది ఘటికల అనంతరం పెరుగూ అన్నం ప్రాప్తి-తూర్పు ఉత్తర దిశల ప్రయాణానికి శ్రేయస్సు.

ఈ నక్షత్రంలో వ్యాధి ప్రాణాంతకమే అవుతుంది. లేదా, 7రోజులపాటు అరిష్టాన్ని కలిగిస్తుంది.తచ్ఛాంత్యర్థం-

తామర పువ్వులో కూర్చుని వున్న — ఎరుపు రంగు విగ్రహంలోకిఅధిదైవమైనశుక్రుణ్ణి ఆవాహనచేసి'భగప్రణ' యేతి మంత్ర పూర్వకంగా షోడశోపచార విధులతోనూ అర్చించాలి.ఈ పూజకు- ఎర్రని వస్త్రాన్నీ, ఎర్రనిగంధాన్నీ, ఎర్ర పొగడ పువ్వులనీ, బిల్వ ధూపాన్నీ ఉపయోగించాలి.

శనగలతో కూడిన అన్నాన్ని నైవేద్యం చేయాలి.

అనంతరం "సర్షప ప్రియంగునాభగ" అనే మూల మంత్రంతో-గాయత్ర్యష్టోత్తర శత సహితంగా - హోమం చేయాలి. గంధమాల్య, ప్రియంగోదనాన్ని (పెసరన్నం-లేదా-పులగం) ఉత్తర దిక్కులో బలికి నిమంత్రించాలి. అరిష్టాలు ఉపశమించి ఒక నెలలో సర్వసౌఖ్యాలూ కలుగుతాయి.

## తిథి వార యోగ ఫలాదీన్

ఆదివారం - పుబ్బా తార వలన - విష యోగం
సోమవారం - సిద్ధ యోగం
మంగళవారం - శుభ యోగం
బుధవారం - రంధ్రయోగం
గురువారం - మృత్యు యోగం
శుక్రవారం - అమృత సిద్ధి యోగం
శనివారం - శుభయోగం

భద్రా తిధులలోనూ — భాద్రపద మాసంలోనూ నిర్జీవ యోగం—ఆషాఢం శూన్యయోగం.

అశ్వినీ తార క్రూరగ్రహ సంయుతమైతే — మహా శూలయోగం.

పుబ్బా నక్షత్రంలో ఉత్పాతా లేర్పడితే- ఇంద్రధను స్సులతో వర్షాలు కురుస్తాయి. కాని, దుర్భిక్షం యేర్పడు తుంది.

ఈ పూర్వాఫల్గుణీ తారలో రవిసంక్రమణం జరిగితే ధరలు విపరీతంగా పలుకుతాయి.

## ప్రథమ రజస్వలా ఫలం

పుబ్బలో తొలి సమర్త జరిగిన కన్య- భర్తృహీన, పుత్రహీన- దుష్టప్రవర్తన కలదీ, చెడు దారులలో సంచ రించేదీ అవుతుంది.

## ఇతరాన్

అక్షరాభ్యాసం, అస్త్ర శస్త్రాది అభ్యాసారంభం, మంత్ర ప్రయోగం, దొంగతనం చేయడానికి వెళ్ళేందుకూ, జూదం ఆడేందుకు, మద్యపానానికి, శతృవుల్ని ఉచ్చాటించ డానికీ, నిధి నిక్షేప విషయాత్- అథవా అంజనాది ప్రయో గాలకీ-భూత ప్రయోగానికీ, వాపీకూప తటాక స్థాపనలకీ, అగ్ని ప్రయోగానికీ, మొక్కలు నాటడానికీ- ఇది ప్రశస్త మైన తార.

## జాతక గుణగణాదీన్

పుబ్బా నక్షత్రంలోపుట్టినవాళ్ళు ధనధాన్య వంతులు సౌందర్యవంతులు, దాన గుణం కలవాళ్ళూ, సర్వ జన ప్రియులూ, వివిధ రకాల ఆభరణాల యందూ- అలంకరణ (మేకప్)యందూ మక్కువ కలవాళ్ళుగా వుంటారు. నిత్యం సంగీత రసికులు-పాటలు పాడేవారూ, రవ్వంత చాపల్య వంతులూ, దుబారా ఖర్చులు చేసేవారూ అవుతారు. తల్లి లేని బిడ్డలవుతారు.

## పాదాంశ ఫలాది

పుబ్బ ప్రథమ పాదం రవిది. రాజాంశ-ఈ వేళా సం జాతులు చంచలమైన నేత్రాలు కలిగివుంటారు. బలహీనంగా వుంటారు. అమ్మకం-కొనుగోలు వ్యవహారాలలో నిపుణు లవుతారు.

ద్వితీయ పాదం బుధుడిది. నపుంసకాంశ- వీళ్ళు కీర్తి వంతులు, అతి రూపులు—లేదా— పిల్లలు జడుసుకునేలాంటి రూపం కలవాళ్లూ, ఇతరులకు కష్టం కలిగించే వాళ్ళూ అవుతారు.

తృతీయ పాదం శుక్రుడిది. అభయాంశ. ఈ జాతకు

లకు పుత్ర సంతానంఅధికంగా వుంటుంది.శిల్ప శాస్త్రంలో నిపుణులవుతారు. గణిత శాస్త్ర నిష్ణాతులుగా వుంటారు. (యోగ భ్రష్టతను బట్టి గణిక లవుతారు.)

చతుర్ధ పాదం కుజుడిది- దరిద్రాంశ - జీవితంలో సుఖం వుండదు. నిత్యం కష్టాలే. దానికి తోడు అధిక సంతానం, అందుకు సాయం దరిద్రం.

ఎవరి పేరులో అయితే మొదటి అక్షరం మో, టా, టి,టూ-లలో ఒకటయి వుంటుందో వాళ్ళు కూడా ఈ నక్షత్ర ప్రభావాన్ని చవిచూస్తారు.

ఈ నక్షత్రంలో జన్మించినవారి జీవితం ఇరవై సంవత్సరాల వ్యవధి గల శుక్రమహా దశతో ప్రారంభమవుతుంది. అనంతరం రవి దశ - అది 6 సం॥లు.

ఈ జాతకులకు జననాది తొలినెల మాంద్య జ్వర పీడ, రెండవయేట జ్వరభయం, అయిదవయేట అగ్ని భయం,పదహారవయేట మృత్యుభయం- లేదా- నీటి గండం ప్రాప్తిస్తాయి. ఇరవై నాలుగవయేట అన్ని కోణాలా భయాలూ పీడలూ కలుగుతాయి. యాభయ్యవయేట రాళ్లూ— కలహా వలన భయం. అరవై ఎనిమిదవయేట అపమృత్యువు. అధిగమించితే 80 సంవత్సరాలు పరమాయువు.

# ఉత్తర ఫల్గుణి

## (ఉత్తర)

ఉమా! ఉత్తర ఫల్గుణీ తారనే 'ఉత్తర' అనేసూక్ష్మ నామంతో వ్యవహరిస్తారు. ఇది కూడా ఎర్రని రంగులోనే వుంటుంది. రెండు చుక్కలు దండాకారంలో భాసిల్లు తూంటాయి. స్త్రీ లింగతార. మనుష్యగణం. వృషభ యోని, క్షత్రియజాతి. త్రిపాత్తు, ఊర్ధ్వముఖి, స్థిరతార, శూన్యస్థానం, అంధలోచనం, ఏకారస్వరం. అధిపక్షి దీర్ఘ నాసిక (పొడుగయిన ముక్కు కలది- కొంగకావచ్చును.) అధివృక్షం రేగుచెట్టు, అధిదైవం అర్యముడు.

ఋక్షారంభాది పద్దెనిమిది ఘటికలపైన విషనాడి. యాత్రాదులలో ఈ నక్షత్ర సంభవాన- 'పిండి' (ఏఉప్పుడు పిండో నయినా అని అర్థం)ని తినడం క్షేమకరం. పశ్చిమ దిక్కుకీ, దక్షిణ దిక్కుకీ ప్రయాణం శుభప్రదం.

ఉత్తర తారలో కలిగిన రోగ పీడ వలన- యేడు రోజులపాటు అరిష్టాలు కలుగుతాయి. తచ్ఛాంత్యర్థంగా—

—ఎఱ్ఱని రంగూ, రెండు చేతులూ; పద్మాకృతీ కలిగిన స్వర్ణ ప్రతిమను నిర్మించి—తారాధిదైవతమైన అర్యముణ్ని ఆవాహనచేసి 'అర్యమా దేవతా' అనే మంత్ర

యుక్తంగా షోడశోపచారాలతోనూ ఆరాధించాలి. ఈ అర్చనలో ఎర్రని వస్త్రాన్నీ- ఎరుపు గంధాన్నీ, గుగ్గులు ధూపాన్నీ, నీలిరంగు తామరపూవులనీ—లేదా—నల్ల కలువ పుష్పాలనీ మాత్రమే వాడాలి. పూజానంతరం ఎర్రటి అన్నాన్ని నైవేద్యం చేయాలి. తదనంతరం గాయత్ర్యా ష్టోత్తర శతంతో ప్రియంగు ధాన్యాన్ని నేతితో హోమం చేయాలి. అటుమీదట గంధ మాల్యాలతో సహా నెయ్యి అన్నం- ఉత్తర దిక్కులో బలి చేయాలి. 7 రాత్రులలో అరిష్టాలు తొలగి సుఖం కలుగుతుంది.

## తిథివార యోగదీక్

ఉత్తర — ఆదివారం సిద్ధయోగం

సోమవారం - దగ్ధయోగం

మంగళవారం - సిద్ధయోగం

బుధవారం - యమదంష్ట్రి యోగం

గురువారం - శుభ యోగం

శుక్రవారం - శూల యోగం

శనివారం - విష యోగం

చతుర్థి తిథినాడు ఉత్తర నక్షత్రమైతే జ్వాలాముఖి యోగం. భద్ర తిథులలో నిర్జీవ యోగం.

ఈ ఉత్తరా నక్షత్రంనాడు రేవతీతార క్రూరగ్రహచారంతో కూడివుంటే మహాశూలయోగం. మార్గశిరమాసం శూన్యయోగం. అయినప్పటికీ - మార్గశీర్షంలో ఉత్తరా నక్షత్రం ఏర్పడినప్పుడు ఇంద్రచాపదర్శనం, వర్షంపడే అవకాశాలు ఉన్నాయి.

ఉత్తరా ఋక్షంలో ఉత్పాతాలు కలగడం వలనప్రజలంతా ఆకలి భయంతో అల్లాడిపోతారు. ఈ తారలో రవి సంక్రమణం జరిగితే ధరలు మధ్యతరహాగా వుంటాయి.

## ప్రథమ రజస్వలా ఫలం

ఉత్తరా తారలో తొలిగా యుక్తవయస్కురాలైన యువతి మగబిడ్డల్ని కంటుంది.

## ఇతరాన్

ఋతు, పుంసవన, సీమంత, నామకరణ, అన్నప్రాసన వేదాభ్యాసారంభం, చౌలం, ఉపనయనం, సమావర్తనం, వివాహాదులకీ - క్రొత్తబట్టలూ - నగలూ ధరించడానికీ, పట్టాభిషేకానికీ, సింహాసనాన్నధిష్ఠించేందుకు,ఏదైన కొత్త గ్రామంలో గాని-నగరంలోగాని ప్రవేశించేందుకు, కొత్తగా రథం యెక్కేందుకు, బీజావాపన మొదలైన వాటికి-ఉత్తర తార ఉత్తమం.

## జాతక గుణగణాది

ఉత్తర నక్షత్రంలో జన్మించిన వాళ్ళు - ఆత్మాభిమానులు, సర్వకార్య నిర్వహణదక్షులు, ధర్మాత్ములు నేర్పరులూ, ప్రతాపవంతులూ, వినయశీలురూ, పండితులు. దేహంపై తిలకాలు గలవాళ్ళూ అవుతారు. వీళ్ళది వేడిశరీరం అల్ప సౌఖ్యం. స్త్రీవ్యసనం వల్ల రోగపీడుతులవుతూంటారు.

## పాదాంశా ఫలం

ఉత్తర పూర్వపాదం - గురుడిది - ఉత్పన్నాంశ - ఈ వేళాప్రభూతులు వాతరోగ పీడితులూ, నిత్యపరిశుద్ధులు ప్రబంధ ప్రియులు - అంటే - ప్రౌఢ విషయాలలో కాంక్ష గలవారూ - కావ్యాస్వాదనా చతురులు అవుతారు.

రెండవపాదం శనిది-పాపాంశ - పరపీడ, చంచలత్వం దరిద్రం - వీరి లక్షణాలు.

మూడవపాదం కూడా శనిదే. కాని, ఇది ఉగ్రాంశ - ఈ అంశలో జన్మించినవాళ్ళు చేసిన మేలును మరచిపోయే వాళ్ళూ, చెడువాదనలు చేసేవాళ్ళూ, డాంబికులు, గర్విష్టులు అందరినీ వేళాకోళం చేసేవాళ్ళూ అవుతారు.

ఆఖరి పాదం నాలుగవది గురుడిది, శుభాంశ-ఈ జాతకులు విద్యా వినయసంపన్నులూ, పుత్రవంతులూ అవుతారు.

ఈ తారా సంజాతుల జీవనం 6 సంవత్సరాల వ్యవధి గల రవి మహాదశతో ప్రారంభమవుతుంది. తరువాతిది

చంద్ర దశ. అది 10 సం॥లు.

కేవలం ఈ తారలో జన్మించడమే కాకుండా - ఎవరి పేరులోని తొలి అక్షరం "టే - టో - పా - పీ - " అనే నాలుగింటిలో ఒకటిగా వుంటుందో వారుకూడా ఈ తారా ప్రభావానికి లోనవుతారు.

ఈ జాతకులకు జననాది నాలుగో రోజున మాంద్యజ్వర భయం, మూడవనెల వాతపీడ, అయిదవయేట జ్వర పీడ - నాలుగు కాళ్ళ జంతువుల వలన భయం, ముప్పయ్యవ యేట వాతాగ్నుల వలన భయం, 60 లేదా 70వ యేట అపమృత్యు భయం అధిగమించితే పరమాయువు 99 సంవత్సరాలు

# హస్త

చేతి ఆకారంలో అయిదు తారలు కూడి వున్నదే హస్తా నక్షత్రం. ఇది నల్లని రంగు కలది. పురుష తార. దేవ గణం. మహిష (గేదె-దున్న) యోని, వైశ్యజాతి, తిర్యఙ్ముఖం, మందలోచనం, శీఘ్ర ఫలప్రదమైన నక్షత్రం. అంత ర్ముఖి - విషమ తార - స్థానం పట్టణం. మండలం వాయువు. అకారాక్షరస్వరం. అధిపక్షి చిలుక. అధివృక్షం ప్లక్షం (కుంకుడు) అధిదైవం సూర్యుడు.

ఋక్షారంభాది ఇరవయ్యొక్క ఘటికలపైన విషనాడి అన్ని దిక్కుల ప్రయాణాలకూ మంచిది. యాత్రాదులలో ఈ తారనాడు నువ్వులతో కలిసిన ఆహారం శ్రేయస్కరం.

హస్తా నక్షత్రంలో జ్వరగ్రస్తమైనట్లయితే వారం రోజులు అరిష్టం. తచ్ఛాంత్యర్థం

## అథ హస్తా తారారిష్ట శాంతి పూజా

తామరపువ్వు రంగులో, రెండు చేతులు కలిగి, ఒక చేత పద్మాన్ని ధరించి, యేడు గుఱ్ఱాల్ని పూన్చిన రథంలో వున్న సవితాదేవత యొక్క బంగారు ప్రతిమను చెక్కించి- ప్రాణ ప్రతిష్ఠాన్యాసాద్యా కళా వాహనాదుల్ని చేసి-"జాత వేదసే" అనే మంత్రయుతంగా- ఎరుపు వస్త్రం, ఎరుపు గంధం ఎరుపురంగు పువ్వులు దశాంశం గుగ్గులు ధూపాల నుపయోగిస్తూ-షోడశోపచార విధిగా పూజించాలి. అనంతరం గాయత్ర్యాష్టోత్తరంతో-అర్క (జిల్లేడు) సమిధల్ని నేతిలో హోమం చేయాలి. గంధమాల్యాదుల్ని, ఆపూపాన్నాలనీ తూర్పు దిక్కున బలి చేయాలి. తద్ద్వారా అరిష్టాలు యేడు రాత్రులలో తొలగిపోతాయి.

## తిధివార యోగాదులు

ఆదివారం హస్తా నక్షత్రం సిద్ధయోగం. ఆరోజు పంచమీ తిథి కలిస్తే నాశనయోగం.

సోమవారం-దగ్ధ యోగం

మంగళవారం -వర యోగం

బుధవారం-యమకంటక యోగం

గురువారం-కలహా యోగం

శుక్రవారం - మృత్యు యోగం

శనివారం - సప్తమీతిథీ యుతంగా - త్రిపుష్కర యోగం. పౌర్ణమీనాడు నిర్జీవ యోగం.

హస్తా తారనాడు, ఉత్తరభాద్ర కూ్రరగ్రహయుత మయితే మహా శూలయోగం.

పుష్యమాసం శూన్యయోగం.

హస్తా నక్షత్రంలో ఉత్పాత దర్శనం వలన ప్రజలు వ్యాధిపీడితులూ భయస్థులూ అవుతారు.

ఈ నక్షత్రంలో సూర్య సంక్రమణం జరిగితే ధరలు మధ్యమంగా వుంటాయి.

## ప్రథమ రజస్వలా ఫలం

హస్తలో - తొలిగా రజస్వలయైన బాలామణి పురుష సంతానం కలది అవుతుంది.

## ఇతరాని

ఋతు, పుంసవన, సీమంత, నామకరణాన్న ప్రాశన చౌలోపనయిన వివాహాలకు, చెవులు కుట్టించేందుకు, అక్షరాభ్యాసానికి, క్షౌరం చేసుకోవడానికి - చేయించుకోవ

డానికీ, వేదశాస్త్రాభ్యాసారంభానికీ, సమావర్తనానికీ తైలాభ్యంగనస్నానానికీ, క్రొత్తబట్టలు తొడుక్కోవడానికీ, క్రొత్త నగలు ధరించుకోవడానికీ, శాంతులూ - పౌష్టికాలూ - మహోత్సవాలూ చేసుకోవడానికీ, క్రొత్తగారథాలూ - పల్లకీలూ - గుఱ్ఱాలూ అధిరోహించడానికి, అంటే క్రొత్తగా వాహనాలుపయోగించుకోడానికీ, పశువుల్ని కొనుక్కోడానికీ, ఇంటికి తెచ్చుకోవడానికీ, వ్యవసాయారంభానికీ, విత్తులు చల్లడానికీ, ధాన్యం తెచ్చుకునేందుకు, మణిమాణిక్యాది రత్నాలు కొనేందుకు - ఇంటికి తెచ్చుకునేందుకు, మంత్రాభ్యాసానికీ, శాస్త్రాభ్యాసానికీ, యంత్రారంభానికీ, వైద్యారంభానికీ, చెరువులు త్రవ్వడానికీ, యజ్ఞాదులలో దీక్ష తీసుకోవడానికీ, రాజ్యాభిషేకానికీ, రాజసందర్శనానికీ, ఏవం విధాలైన శుభకర్మలకీ - హస్త సర్వ ప్రశస్త.

## జాతక గుణగణాది

హస్తా నక్షత్రంలో అవతరించినవాళ్ళు - గంభీరవంతులు, ఇతరుల యందు రక్షకులుగా వ్యవహరించేవాళ్లూ, ధనవంతులు, అధిక సంతానవంతులు, యావ్వనంలో వున్న స్త్రీలను ఆనందింపచేసేవారూ, సర్వదా రాజుమల్లే ప్రవర్తించేవాళ్ళూ, నిపుణులు, కీర్తి ప్రతిష్టలుగలవాళ్ళూ, బ్రాహ్మణులనూ - గురువుల్నీ - పెద్దల్నీ గౌరవించే వాళ్ళుగా వుంటారు.

శరీరంమీద మత్స్యాంశాలు వుంటాయి. అప్పుడప్పుడు భార్యకు దుఃఖం కలిగిస్తూ వుంటారు.

## పాదాంశాదిః

హ స్త మొదటి పాదం-కుజుడిది-క్రూరాంశ. ఈవేళా సంజాతులు పాపకార్యాలు చేసేవాళ్లూ, బలవంతులూ, పారమార్థిక చింతన కలవారూ అవుతారు.

రెండో పాదం-శుక్రుడిది. ముక్తాంశ. ఈ జాతకులు నిత్యం మంచిమాటలనే మాట్లాడేవారూ, శాన్తంత మేద కులూ (మందబుద్ధులూ) అవుతారు.

తృతీయపాదం బుధుడిది- పండితాంశ. వీళ్ళు చెడ్డ బుద్ధికలవారూ, కాముకులూ, అమ్మకం - కొనుగోళ్ళు విష యాలలో మహానిపుణులూగా వుంటారు.

చతుర్థ పాదం చంద్రుడిది. ధనాంశ. వీళ్ళు రాచ కార్యాలు చేయడంలో ఇష్టంగలవారూ సన్మానాలుపొందే వారూ,అభిమానవంతులు, రవంత కోపిష్టివారూ అవుతారు.

హస్తానక్షత్రజాతకుల జీవనం 10 సంవత్సరాల పరిధి గల చంద్రమహాదశతో ప్రారంభమవుతుంది. తదుపరి కుజ మహాదశ. ఇది 7 సంవత్సరాలు.

ఈ నక్షత్రంలో జన్మించకపోయినప్పటికీ - ఎవరి పేరులో మొదటి అక్షరం-పూ-షం-ణా-ఢా- అనే నాలుగు అక్షరాలలోనూ ఒకటయ్యి వుంటుందో- వాళ్ళంతా ఈ తారా ప్రభావంలోకే వస్తారు.

ఈ ఋక్షోద్భవులకి జననాది మొదటి సంవత్సరం జ్వరగండం, మూడవయేట శత్రువులవలన భయం, డబ్బు ఖర్చు. ఆరవయేట అపమృత్యు భయం-గడిస్తే పదవఏట పునఃశత్రుమూలకంగా భయం.ఇరవై రెండోఏట పైత్యపీడ, ఇరవైనాలుగోఏట శుభకార్యాలద్వారా సుఖసంతుష్టులూ బంధుమిత్రసమాగములూ కలుగుతాయి. నలభయ్యో ఏట పునఃశత్రుమూలకంగాగాని- అస్త్రిలవలనగాని- చెరువులూ, చిల్లంగులూ ప్రయోగాదులవలన కాని- మందుగుండు సామాగ్రి వలనగాని భయం ఏర్పడుతుంది. చిత్తవైకల్యం కలుగుతుంది. అరవయ్యోఏట అపమృత్యుభయం, తప్పితే- 88 సంవత్సరాలు పరమాయుర్దాయం.

# చిత్ర

శీతసగేంద్రకులకేతా! చిత్ర అనబడే ఈ నక్షత్రాన్నే 'చిత్తి' అని కూడా వ్యవహరిస్తూంటారు.

ముత్యంలావుండే శ్వేతవర్ణపు ఒకేఒక్క తారయిది. స్త్రీ నక్షత్రం. రాక్షసగణం. వ్యాఘ్రు(పులి) యోని, తిర్యఙ్ముఖి, మధ్యలోచన, మృదునక్షత్రం, బాహ్య-సౌమ్యతార, స్థానం పట్టణం వాయుమండలం, ద్విపాది, ఏకారస్వరం. అధిపక్షి వృకం,అధివృక్షంబిల్వ(మారడు)అధిదైవతంత్వష్ట.

పడమర దక్షిణ దిక్కులుగా ప్రయాణానికి మంచిది. ఋక్షాది పధ్నాలుగు ఘటికలపైన చిత్రాన్న భోజనం శ్రేయస్సు. ఇరవై ఘటికలపైన విషనాడి, అప్పుడు యాత్ర చేయకూడదు.

ఈ తారలో జ్వరపడితే పదకొండురోజులు అరిష్టం. తచ్ఛాంత్యర్థంగా—చతుర్భుజాలతో - ఆ నాలుగు చేతులా అక్షసూత్రకమండలువులూ కమలముద్రా వహించినట్లుగానూ చిత్ర వస్త్రం ధరించినట్లుగానూ, చిత్రవర్ణ యుతంగానూ బంగారు విగ్రహాన్ని చేయించి, కళాన్యాసాది కార్యక్రమా లన్నీ కానిచ్చి, "చిత్రం దేవానాం" అనేమంత్రపూర్వకంగా ధ్యానావాహనార్ఘ్య పాద్యాది షోడశోపచారయుతంగానూ పూజించాలి. ఈ పూజలో - కుంకుమగంధాన్ని చిత్ర ఆపూ పుష్పాన్నీ సర్జరసధూపాన్నీ ఉపయోగించాలి. ఉం డ్రాళ్ళూ పాలూ నైవేద్యం చేయాలి. పూజానంతరం గా యత్ర్యాష్టోత్తరశతయుతంగా - నెయ్యీ, చిత్రాన్నమూ హోమం చేయాలి. అటు పిదప గంధమాల్యాల్నీ, చిత్రా న్నాన్నీ—ఉత్తరదిక్కులో బలిచేయాలి. దీని వలన పదిహే నురోజులలో సుఖశాంతులు కలుగుతాయి.

## తిథివారయోగాదీన్

చిత్ర-ఆదివారం-నందాతిథితో కూడివుంటే-వరయోగం

సోమవారం - శుభయోగం

మంగళవారం - నాశనయోగం

బుధవారం - యమకంటకయోగం

గురువారం - మృత్యుయోగం

శుక్రవారం - శుభయోగం

శనివారం - రంధ్రయోగం

ఆనాడు నందాతిథియుక్తమయితే నిర్జీవయోగం.

చిత్రా నక్షత్రంనాడు పూర్వాభాద్ర క్రూరగ్రహ భూయిష్టమంటే మహాశూలయోగం. వైశాఖ మాసం శూన్యయోగం.

చిత్రా తారలో ఇంద్రధనుసు కనుపిస్తే అధికవర్షం.

## ప్రథమరజస్వలాదీన్

ఈ తారలో తొలిసమర్తయైనపొలతి-పురుషసంతానవతి అవుతుంది.

## ఇతరాన్

స్త్రీసమాగమ, నామకరణాన్న ప్రాశనలకీ, చెవులు కుట్టించడానికీ, చౌలోపనయన వివాహ అక్షరాభ్యాసాదులకీ వేదశాస్త్రాభ్యాసానికీ, తైలాభ్యంగన స్నానానికీ, చిత్ర

వస్త్రాలూ-ఆభరణాలూ ధరించేందుకూ, ఏనుగులూ-గుఱ్ఱాలకి శిక్షణనిచ్చేందుకూ, వాటిని బంధించేందుకూ, రథారోహణకీ, (రంగుల) బొమ్మలు గీయడానికీ, ఏదైనా వృత్తిని ఆరంభించుకోడానికీ, మందులు (ఔషధాలు) వాడటానికీ, వైద్యారంభానికీ, గయాశ్రాద్ధాది కర్మలకూ చిత్రా నక్షత్రము సిద్ధతార.

## జాతక గుణగణాది

ఈ నక్షత్రంలో జన్మించినవాళ్ళు స్త్రీలోలులూ, భోగవంతులు, కాముకులు, కామశాస్త్ర ప్రవీణులు, విశాలమైన కన్నులు కలవాళ్ళూ, పెద్దపెద్ద అడుగులున్నవాళ్ళూ, మంచి గంధం-పువ్వులూ అలంకరించుకోవడంలో (ఇది ప్రాచీన విషయం. ఆ కాలంలో పురుషులుకూడా పువ్వులు ముడుచుకోవడం వుండేది. వర్తమాన కాలరీత్యా మనం దీనిని పరిమళ ద్రవ్యాలంకరణ అంటే సెంట్లూ, అత్తరూ వగయిరాల వినియోగంలో అని చెప్పుకోవాలి) యిష్టత కలవారూ, అందరిచేతా ప్రేమించబడేవారూ, ఎడమ భాగంలో మత్స్యాంకాది తిలకాలుండేవారూ అవుతారు.

## పాదాంశాది ఫలం

చిత్రానక్షత్ర ప్రథమ పాదం రవిది-రాజాంశ. ఈవేళా సంజాతులు చంచల మనస్తత్వం కలవారూ, ఉగ్రస్వభావులూ అవుతారు.

ద్వితీయ పాదం బుధుడిది. నపుంసకాంశ-ఈ జాతకులు చాలా తియ్యగా మాట్లాడతారు. కోపం వస్తే మాత్రం - చాలా కాలం వుంటుంది. ఏ నిమిత్తమయినా సరే అధిక కాలం తప్పిస్తారు.

తృతీయ పాదం శుక్రుడిది. అభయాంశ-వీళ్ళు కీర్తి మంతులూ, శౌర్యవంతులూ అవుతారు. పండితులతో సహవాసం చేయడం, నిత్యం వారితోనే గడపడం వీళ్ళ లక్షణం.

చతుర్థపాదం కుజుడిది-ధనాంశ. సంపాదనా ప్రారంభంలో దొంగతనాలకి పాల్పడుతుంటారు. సంపాదన సమకూడాక అటువంటి నేరాలు చేయడం మానేస్తారు. అమిత ధైర్యవంతులు, విక్రమంకలవారూ అవుతారు.

ఈ నక్షత్ర జాతకుల జీవితం 7 సంవత్సరాల పరిధిగల కుజదశతో ఆరంభమవుతుంది. తదుపరి రాహుమహాదశ. ఇది 18 సంవత్సరాలుంటుంది.

కేవలం ఈ తారలో జన్మించడమే కాకుండా-పే-పో-రా-రీ-అనే నాలుగింటిలో యేదో ఒకటి తమ పేరులో తొలి అక్షరమయిన వాళ్ళంతా ఈనక్షత్రప్రభావానికి లోనవుతారు

ఈ తారాజాతకులకు జననాదిగా-అయిదవయేట అగ్ని వలన ప్రమాదం, ఎనిమిదవయేట నాలుగుకాళ్ళ జంతువుల వల్ల పీడ, ఇరవయ్యవ సంవత్సరంలో ఆయుధాలవలన గాయాలు, ఇరవయ్యోయదవయేట మారకం వున్నాయి.

ఈ జాతకులకి యెప్పుడయినా సరే-తులా (ఆశ్వీయుజ కార్తీక మాసంలో శుక్లపక్ష దశమీ ఆదివారమయ్యి, ఆనాడు చిత్రా నక్షత్రం కూడా నమకూడితే- సూర్యోదయ సమయం మొదలు పధ్నాలుగు ఘటికలలో సన్నిపాతంవలన అపమృత్యుభయం వుంటుంది. అందునా-అది ఇరవయ్యయి దవయేట తీవ్రంగా వుంటుంది. అది గడిచి గండంగట్టెక్కితే —99 సంవత్సరాలు పరమాయుర్దాయం.

# స్వాతి

రాగమయీ! చిత్రా నక్షత్రానంతర తారయైన 'స్వాతీ' తార ఎఱుపురంగుతో యేపారుతుంది. ఏకాంతంలో యెవరో పారవేసుకున్న ఒకేఒక్క పెనుమాణిక్యపు శోభ లతో విరాజిల్లుతుంది.

ఈతార దేవగణానికి చెందినది. మహిష(గేదె) యోనికి సంబంధించినది. ఉగ్రస్వభావి. తిర్యఙ్ముఖం, చతు ష్పాత్తు, ఊర్ధ్వలోచనం, అకారస్వరం, శూన్యస్థానం, వాయుమండలం; అధిదైవతం వాయువు—అధివృక్షం—అర్జు నం—పురుష నక్షత్రం.

సాధారణంగా ఈ నక్షత్రం—రత్నమణిమాక్తికాదుల జన్మవేళ. ప్రయాణాలతో యజమానుల జాతకరీత్యా—అధిక

శాతం వర్జనీయం, తారాప్రవేశాది 40 ఘటికల కాలానంత
రం ఉసిరికాయను తిని - దక్షిణ, పశ్చిమ దిశగా ప్రయాణం
చేస్తే శుభం కలుగుతుంది.

ఈ నక్షత్రంలో యేర్పడిన జ్వరం ప్రాణభయాన్ని
సూచిస్తుంది, లేదా, ఒక నెలఅరిష్టాన్ని కలిగిస్తుంది, తచ్ఛాంతి
నిమిత్తంగా

రెండు చేతులూ, అందులో ఒక చేతిలో పాశాయుధం,
రెండవది అభయహస్తంగా వున్న నలుపు లేదా నీలంరంగు
శ్రీకృష్ణవిగ్రహం నిర్మించి పూజించాలి.

అధిదైవతమైన వాయువును ఆ నలుపు విగ్రహంలో
నికి ఆవాహనచేసి, షోడశోపచారాలతోనూ ఆరాధించాలి,
ఈ పూజలో కృష్ణాగురుగంధాన్నీ, కృష్ణాగురుధూపాన్నీ,
దనవ పుష్పాన్నీ, దద్ధోజన నివేదనాన్నీ కొనసాగించాలి.

"వాయు" రితిమంత్రేణ పూజలు కొనసాగించాలి.
పూజానంతరం-గాయత్రీ అష్టోత్తర సహితంగా-లాజాజ్యాల
ను హోమం చేయాలి.

గంధమాల్యాదులనీ, దధ్యాన్నాన్నీ ఉత్తరదిశలో
బలిగా వుంచాలి. తద్వారా-ఒక నెలలో స్వస్థత చేకూరు
తుంది. అరిష్టాలు నశిస్తాయి.

# తిథివారయోగాదిఫలములు

ఈ స్వాతీ నక్షత్రం ఆదివారంనాడువస్తే-అది మృత్యు యోగమవుతుంది- సోమవారమయితే సిద్ధయోగం - మంగళ వారం నందాయోగం- బుధవారం సుధాంశుయోగం- గురు వారం అమృతయోగం - శుక్రవారం యమకంటకయోగం - శనివారం సిద్ధయోగం.

పై చెప్పిన యోగాలలో - మంగళవారం నందాసువర యోగాలలో - నందాసుయోగాలు నిర్జీవాలు.

స్వాతీ నక్షత్రంలో చంద్రచారంవున్ననాడు- శతభిషా తారలో క్రూరగ్రహసంచారంవున్నట్లయితే-శుభయోగాలు వికటించి-మహాశూలయోగంగా పరిణమిస్తాయి.

వైశాఖమాసంలోగాని ఇతర శూన్యమాసాలలో గాని; ఈ స్వాతీతారయందు ఉత్పాతాలు సంభవించితే- అవి వాయుగుండాలకీ, వాయుపీడనలకీ చిహ్నాలవుతాయి. స్వాతీ నక్షత్రంలో రవి సంక్రమణం జరిగితే-వెలలు సాధార ణంగా వుంటాయి.

ఈ నక్షత్రంలో ప్రథమ రజస్వలయైన కన్య-సౌభాగ్య వతీ, సన్మార్గ ప్రవర్తినీ అవుతుంది.

స్త్రీ సంగమం, నామకరణం, అన్నప్రాశనం, చౌలం ఉపనయనం, క్షౌరకర్మ, అక్షరభ్యాసం, జ్యోతిష్య - వేద - శాస్త్రాది అభ్యాసారంభం-సమావర్తనం, వివాహం, తైలాభ్యంగం, క్రొత్తబట్టలు కట్టుకోవడం, ముత్యాల ఆభరణాలు ధరించడం, నాట్యం-గాత్రం-వాద్యవిద్య -ఇత్యాది ఆరంభాలకీ, ఏనుగులూ-గుఱ్ఱాలూ-పల్లకీలూ అధిరోహించేందుకు, వ్యవసాయరంభానికీ, బీజవాపనాది సమస్త శుభకార్యాలకీ ఇది ప్రశస్తమైన నక్షత్రం.

## ఈ నక్షత్రజాతకుల గుణాగణాదులు

ఈ స్వాతీ నక్షత్రజాతకులు దాతలు, సౌభాగ్యవంతులు ధైర్యవంతులు, పొడగరులు, విశాలాక్షులు-విశాలమైన వక్షస్సంపద కలవాళ్ళు, ప్రతిష్ఠావంతులు, అనేకమైన భోగభాగ్యాలననుభవించేవాళ్లూ, దైవబ్రాహ్మణపూజారతులూ బంధుప్రియులు, బుద్ధిమంతులు అవుతారు.అదేతార వియోగ జాతకులు-ఆల్పోదరులు, స్వతంత్రులు అవుతారు.

## పాదాంశాది గణగుణాని

స్వాతీ ప్రథమ పాదం గురుడిది - ఉత్పాన్నాంశ-ఈ జాతకులు అతివాగుడుకాయులే అయినా, విషయ ప్రతిపాదనలో సూక్ష్మవాక్కులు — సర్వజ్ఞులు అయివుంటారు.

ద్వితీయ పాదం శనిది-ధనాంశ-ఈ జాతకులు చెడ్డ వాళ్ళు అవుతారు-రౌడీలు, గూండాలు, దొంగలుగా పరిణ మిస్తారు, కాని-తమకి సాయం చేసినవారిపట్ల మాత్రం సర్వ త్రా కృతజ్ఞులై వుంటారు.

తృతీయపాదం శనిది-ఉగ్రాంశ-ఈజాతకులు మూర్ఖులు అతి కోపకులు, శత్రువులపట్ల ద్వేషమేతప్ప సంధిభావంలేని వాళ్లూ-అతి ఖర్చుగలవాళ్ళుగా వుంటారు.

చతుర్థపాదం గురునిది-ఉత్కృష్టాంశ-వీళ్ళు కోపిష్టులే అయినప్పటికీ సర్వజనప్రియులు గురుభక్తి సహితులు-ధని కులు అయివుంటారు.

జననాది వీరి జీవితం 18 సంవత్సరాల విస్తీర్ణమైన రాహుమహార్దశతో ప్రారంభమవుతుంది.

ఈ స్వాతి నక్షత్రంలో జన్మించిన వాళ్ళకి తదాది 8వ రోజున మాంద్యజ్వరపీడ, 4వ సంవత్సరములో వాతజ్వర భయం, 8వ యేట రోగభయం, 12వ యేట అపమృత్యు భయం, 30వ యేటవాతజ్వరభయం, 45వయేట అపమృత్యు భయం, వీటిని అధిగమించితే ఈ నక్షత్రజాతకులకు 90 సం వత్సరాలు పరమాయువు.

# విశాఖా నక్షత్రం

ఈ నక్షత్రం ఎరుపు రంగుతో కూడుకుని వుంటుంది. అయిదు నక్షత్రాలు కుమ్మరిసారె ఆకారంలో అందగిస్తాయి పురుషలింగనక్షత్రం. అధివృక్షం కనకం (కొంతమంది నాగ కేసరం అని చెబుతారు. కనక వృక్షానికీ నాగకేసరానికీ రూపంలో పోలికలు యెక్కువే-కాని; గుణాలలో తేడావుంది. అయినా వర్తమాన ప్రపంచంలో కనకవృక్షమే- నాగకేసరంగా వ్యవహరిస్తున్నారు.) వ్యాఘ్రయోని, అధిదేవతలు ఇంద్రాగ్నులు. ఉగ్రజాతి. త్రిపాదనక్షత్రం. అధోముఖం. అంధకలోచనం.ఉకారాక్షరస్వరం. అధిపక్షి జలూకం. తారోదయాది 40ఘటికల అనంతరం విషనాడి. యాత్రలు చేయకూడదు. అయినప్పటికీ ఈ తారలో యేదైనా కార్యం తలబెట్టినట్లయితే 40 ఘటికల తరువాత నవ్వులతో కూడిన, లేదా తత్ సంబంధితమైన ఆహారం తీసుకోవలసి వస్తుంది, తూర్పు, ఉత్తర దిశల ప్రయాణాలకి శుభం.

ఆది, శని,మంగళవారాలతో కూడిన-పాడ్యమి,చవితి, షష్టి, అష్టమి, ద్వాదశీ తిథులతో విశాఖానక్షత్రం కలిసి-ఆ వేళలో యెపుడైనా జ్వరాలు కలిగితే అతి ప్రాణాంతకాలే అవుతాయి. ఇతరేతర గ్రహదశా యోగాలు అనుకూలించినా 15రోజులపాటు ప్రాణారిష్టంకలుగుతుంది.ఆశాంతినిమిత్తంగా

ఎఱ్ఱని రంగుతోకూడినదీ, ఏనుగునుఅధిరోహించినదీ, ఒక చేతిలో పాశం (త్రాడు-లేదా-సూత్రం) మరొక చేతిలో అంకుశం ధరించి మిగిలిన రెండుచేతులా అభయ- వరద- ముద్రలు వహించిన చతుర్భుజయుక్త ఇంద్రాగ్నుల విగ్రహాన్ని బంగారంతో చేయించి-కుంకుమ గంధం' వందరేకు లున్న పువ్వులు, దేవదారుద్రవ్యధూపం, బెల్లంతో వండిన పరమాన్నం నివేదనగా-'ఇంద్రాగ్నయో' రితిమంత్రంతో-ధాన్యావాహనాసనార్ఘ్యపాద్యాదిషోడశోపచారాలతోనూ ఆరాధించాలి. అనంతరం గాయత్ర్యాష్టోత్తర సహితంగా క్షీరాన్నంతో హోమం చేయాలి. చివరగా గంధమాల్యాదులతోనూ బెల్లంతో వండిన పరమాన్నంతోనూ ఉత్తర దిక్కులో బలిచేయాలి. తద్వారా పదిహేను రోజులలో అరిష్టాలు నశించి సుఖశాంతులు కలుగుతాయి.

## తిధివార యోగ ఫలాదీన్

విశాఖానక్షత్రం ఆదివారంతో కూడివస్తే- అది ఉత్పాతయోగం.

సోమవారం ఏకాదశీ తిథితో వస్తే- త్రిపుష్కర యోగం. (ఇది చాలావిశేషమయిన యోగం. ఎందువల్లంటే సాధారణంగా సోమవారంనాడు ఏకాదశిరావడందగ్ధయోగం

కాని ఆ రోజున ఈ రాక్షస నక్షత్రమయిన విశాఖ చేరితే మాత్రం 'త్రిపుష్కర'మనే పుణ్యయోగం అవుతుంది. ఇతరేతర సమస్త యోగాలూ కలిసివస్తే సరే-అలా కాకపోతే మాత్రం యీ మూడు పుష్కరాలయోగం మూడు ముక్కలూ, ఆరు చెక్కలూ అయిపూరుకుంటుంది.)

ఇక విశాఖతారమంగళవారంనాడుపడితేదగ్ధయోగం
బుధవారమయితే—నాశనయోగం
గురువారమయితే—ఆనందయోగం
శుక్రవారమయితే—మృత్యుయోగం
శనివారమయితే—సిద్ధయోగం

చవితీ తిథినాడు-కర్కాటకలగ్న పర్యంతం విశాఖా నక్షత్రం వుంటే-అది వరయోగం. ఈ నక్షత్రంలో ఆగ్నేయ దిశగా ఉత్పాతాలు కనుపిస్తే- కఱవుకాటకాలు, అగ్నిపీడ కలుగుతాయి. రవి సంక్రమణం ఈ విశాఖ తారలోజరిగితే ధరలుమధ్యమంగా వుంటాయి. విశాఖనక్షత్రంతో కూడిన-కృత్తికా నక్షత్రం క్రూరగ్రహాయుక్తమయితే- మహాశూల యోగం.

## ప్రథమ రజస్వలా ఫలం

ప్రపథమంగా విశాఖానక్షత్రంలో రజస్వలయైనకన్య సౌభాగ్యవతీ, పుత్ర సంతానవతీ అవుతుంది.

## ఇతరాన్

వ్యవసాయరంభం, విత్తనాలు జల్లడం, నిధి నిక్షేపాల త్రవ్వకాలకీ, వాపీకూప తటాకాదులకీ ఇది మంచిది.

## జాతక గుణగణాది

వీళ్ళు పండితప్రియులు-వినయ సంపన్నులు - ధనవంతులూ, బంధువర్గానికి మేలుచేసేవాళ్ళూ, ఏపనిలోనైనా నేర్పరులు, యేవిషయాన్నయినాస రేస్పష్టంగా, దాపరికాలు లేకుండా చెప్పగలిగేవాళ్ళూ అయివుంటారు. కాని, అతి ఋణ పీడితులూ, ఎర్రటికళ్లు కలవాళ్ళూ, స్త్రీప్రియులూ. త్వరితగతిలో వ్యాధిగ్రస్తులూ, ముఖంగా-గుహ్యం-ఉదరాలపై మత్స్యాంకాది తిలకాలు కలవాళ్ళూ అవుతారు. అయినప్పటికీ వీళ్ళు దీర్ఘాయుష్మంతులు.

## పాదాంశ ఫలాది

విశాఖ మొదటిపాదం కుజుడిది-సౌఖ్యాంశ - వలచటి ఛాతీ, ఎరుపు కన్నులూ కలిగి, ధనవంతులయి వుంటారు.

రెండోపాదం శుక్రుడిది, భోగాంశ - రూపవంతులు, సౌందర్యవంతులు, అందమైన భార్య కలవాళ్ళూ, సౌఖ్యవంతులు, దేనినైనా న్యాయంపరంగానే సంపాదించుకునేవాళ్లూ అవుతారు. చెవిటివాళ్ళవుతారు.

మూడోపాదం బుధుడిది-సౌమ్యాంశ- ఈ జాతకులు మంచిచెడులపట్ల విచక్షణ కలవాళ్ళు, నేర్పరులు, దానగుణ వంతులుగా వుంటారు. అంధులయ్యే అవకాశంవుంది.

నాలుగోపాదం చంద్రుడిది. అర్థాంశ. ఈవేళా సంజాతులు అంత్రరోగులు, స్త్రీప్రియులుగా వుంటారు.

విశాఖా నక్షత్రంలో జన్మించినవారిజీవితం 16 సంవత్సరాలు పరిధిగల గురుమహాదశతో ప్రారంభమవుతుంది. తదుపరి శనిమహాదశ ఇది 10 సంవత్సరాలు.

ఈ తారావేళలోనే కాకుండా, ఎప్పుడు జన్మించినా ఎవరి పేరులోని మొదటి అక్షరం-తీ-తూ-తే-తో-అనే నాలుగక్షరాలలోనూ ఒకటిగావుంటుందో, వాళ్ళందరిమీద ఈ నక్షత్ర ప్రభావం వుంటుంది.

ఈ తారాజాతకులకు జననాది అయిదవయేట నేత్ర వ్యాధి పదమూడవయేట వాతపైత్యజ్వరభయం, ముప్ఫయి మూడోయేట ఆయుధాలవలన భయం.

ధనూ (మార్గశిర-పుష్య) మాసంలో-శుద్ధ చతుర్దశీ ఆదివారం విశాఖానక్షత్రయుతమైన రోజునసూర్యోదయాది పధ్నాలుగు ఘటికలపైన ఉదరవ్యాధితో అపమృత్యు భయం కలుగుతుంది. అధిగమించితే-97 సంవత్సరాలు వీరి పరమాయుర్దాయం.

# అనూరాధ

ఈ తార శ్వేతవర్ణంకలది. మూడుతారలు బిస పుష్పాకృతితో అలరారుతుంటాయి. పురుష తార, దేవగణం. హరిణీ (లేడి) యోని. శూద్రజాతి. చతుష్పాత్తు, పార్శ్వ ముఖి, మందలోచని, చంద్రపరమైన మృదుతార. స్థానం పట్టణం. ఇంద్రమండలం. అధిపక్షి చిలుక, అధివృక్షం పనస, అధిదైవం మిత్రుడు. ఆకారాక్షరస్వరం,

ఋక్షాది పది ఘటికల అనంతరం విషనాడి. అన్ని దిక్కుల ప్రయాణాలకీ మంచిది. ఈ తారలో జ్వరపడిన వాళ్ళకి ప్రాణభయం యేర్పడుతుంది. లేదా ఒకనెల జరిష్ట కాలం. తచ్ఛాంత్యర్థం.

## అనురాధ శాంతి పూజ విధిః

ఎరుపురంగు, కుంకుమవస్త్రం ధరించిందీ, మూడు చేతులలో పద్మాలనీ-ఒక చేత అభయముద్రనూ వహించిన చతుర్భుజాలూ కలదీ, పద్మాసనమందున్నదీ అయిన మిత్రదేవుడి బంగారు విగ్రహాన్ని చెక్కించి ప్రాణప్రతిష్టా, కళాన్యాసాదులు చేసి,'దేవస్యత్వే'తి మంత్రానుసారంగాధ్యానావాహ

నానర్ఘ్యపాద్యాది షోడశోపచారాలతోనూ పూజించాలి. ఈ ఆరాధనలో కుంకుమగంధం, కదళి (అరటి) పుష్పం మారేడు ధూపం ఉపయోగించాలి. కృసరాన్నాన్ని నివేదించాలి. అనంతరం గాయత్ర్యాష్టోత్తరశత సమేతంగా-కంద మూల ఫల కృసరాన్నాలని నేతితో హోమం చేయాలి. పిమ్మట గంధమాల్యాదుల్ని కృసరాన్నంతో ఉత్తర దిక్కులో బలిచేయాలి. అలా చేయడంవలనఅరిష్టాలు తొలగి ఒక మాసం రోజులలో సౌఖ్యం లభిస్తుంది.

## తిథివార యోగఫలాదీన్

అనూరాధా-ఆదివారమయితే-అది మృత్యుయోగం

సోమవారమయితే-దగ్ధయోగం

మంగళవారం-యమకంటక యోగం

బుధవారం-అపమృత్యుయోగం-ఆనాడు అష్టమీతిథి కలిస్తే-మృత్యుయోగం

గురువారం-వరయోగం

శుక్రవారం-రంధ్రయోగం

శనివారం-సిద్ధయోగం

రిక్తతిథులలో-నిర్జీవయోగం

ఈ నక్షత్రదినాన కృత్తికాతార క్రూరగ్రహయుక్తమయితే మహాశూలయోగం. మార్గశిరమాసం శూన్యయోగం

ఈ నక్షత్రంలో ఉత్పాతాలు తోచడంవలన-ప్రజలకు వ్యాధి పీడ. ఇదే ఋక్షంలో రవి సంక్రమణ జరిగితే-ధరలు మధ్యతరహాగా వుంటాయి.

## ప్రథమ రజస్వలా ఫలం

మొదటిసారిగా అనూరాధా తారలో వ్యక్తురాలైన చిన్నది ధనధాన్యాలు కలదీ, చక్కటి పుత్రసంతానం కలది అవుతుంది.

## ఇతరాన్

ఋతు పుంసవన నామకరణాన్న ప్రాశనలకీ, చెవులు కుట్టించడానికీ, చౌలోపనయన వేదశాస్త్రాభ్యాసాలకీ, సమావర్తనానికీ, వివాహానికీ, తైలాభ్యంగన స్నానానికీ, కొత్త బట్టలు కట్టుకోడానికీ, క్రొత్త ఆభరణాలు పెట్టుకోడానికీ, బంగారం కొనేందుకు, రాజ్యాభిషేకానికీ, రథాలూ-పల్లకీలూ-ఏనుగుల్నీ ఎక్కేందుకు, క్రొత్త వాహనాలు వాడకానికీ, విత్తనాలు చల్లేందుకూ, వైద్యారంభానికీ, శ్రాద్ధ కర్మాదులకీ-ఇది శుభ నక్షత్రం.

## జాతక గుణగణాలు

అనూరాధ తారలో జన్మించినవాళ్ళు -స్నేహశీలురు,

దయార్ద్ర హృదయులు, పరోపకారులు, ప్రజ్ఞావంతులు, చర స్థిరాస్తి సంపన్నులు, సుభగులు, మంచిమార్గంలో ప్రవర్తించేవాళ్లూ, భోగులు, జన్మస్థానానికి ఎడంగా జీవించే వారూ, తక్కువమంది పుత్రులు కలవారూ, స్త్రీలాలసులు, అన్నదాతలు, విశేషమైన ఖ్యాతికలవాళ్ళు, రాజపూజ్యత కలవాళ్ళుగా వుంటారు.

## అథ పాదాంశ ఫలాని

అనూరాధ తొలిపాదం రవిది-రాజాంశ-ఈ వేళానంజాతులు వాగ్వినయ సంపన్నులు, నీతిజ్ఞులు, నిత్యం మంత్రోపాసనలు గాని-మంత్రాంగాలుగాని నెరపేవాళ్ళుగావుంటారు

ద్వితీయపాదం బుధుడిది నపుంసకాంశ-వీళ్ళు వీణానాద ప్రియులు, ఆదర్శమూర్తులూ, మేధావులూ అవుతారు.

తృతీయపాదం శుక్రుడిది. అభయాంశ-వీరికి అస్థిరత్వం అధికంగా వుంటుంది. అయినా, అనుకూలవతియైన భార్య లభిస్తుంది.

నాలుగో పాదం కుజుడిది. నీచాంశ-ఈ జాతకులు ఇతరులకు ద్రోహం చేసేవాళ్ళు, కుట్రలు కుహనాలూ చేసేవాళ్ళు, అనాచారాలు పాటించేవాళ్ళు, దరిద్రులు అవుతారు.

ఇదే తారలో జన్మించిక పోయినా- తమ పేరులో మొదటి అక్షరం- నా-నీ-నూ-నే- అనే నాలుగు అక్షరాల లోనూ ఒకటిగా వున్నవారు కూడా- ఈ నక్షత్రప్రభావం లోనే వుంటారు.

ఈ తారాజాతుల జీవితం 19 సంవత్సరాల పెను పరిధి గల శని మహాదశతో ఆరంభమవుతుంది. తదుపరిది బుధమహాదశ. అది 17 సంవత్సరాలు.

వీరికి జననాది ఆరు నెలలలో గండదోషం వుంటుంది. ఏడు-పదహారుసంవత్సరాల ప్రాయాలలో పైత్యజ్వరభయం, నాలుగుకాళ్ళ జంతువులవల్ల భయం కలుగుతాయి. ముప్ఫ య్యేడు, అరవైనాలుగు వర్షాలలో పైత్యగుల్మపీడాభయం అతిక్రమిస్తే 99 సంవత్సరాలు పరమాయువు.

# జ్యేష్ఠ

ఆశ్రితాభీష్ట సంపూర్ణ కారీ! శ్రీగౌరీ! తారాక్రమంలో పద్దెనిమిదవదయినజ్యేష్ఠానామనక్షత్రంరక్తవర్ణంతో భాసిల్లు తుంది. మూడు తారలు గొడుగు ఆకారంలో శోభిల్లు తూంటాయి. స్త్రీతార, చంద్రసంబంధితం, రాక్షసగణం, హరిణ(లేడి)యోని, చతుష్పాత్తు, తిర్యఙ్ముఖీ, మధ్యలోచ నం, తీక్ష్ణగుణం, శూన్యస్థానం, ఏకాక్షరస్వరం. ఈతారకు

అధిపక్షి చాతకం, అధివృక్షం పూగి (పోక,) అధిదైవతం ఇంద్రుడు.

ఋక్షాది పద్నాలుగు ఘటికలపైన విషనాడి ఆ నాడిలో ప్రయాణం పనికిరాదు. ఇతరవేళలలో దక్షిణ, పశ్చిమ దిశాభిముఖంగా ప్రయాణానికి మేలు.

ఈ నక్షత్రంలో జ్వరపడితే—ప్రాణభయం లేదా ఒక నెల అరిష్టం కలుగుతాయి. తచ్ఛాంత్యర్థం—

పసుపురంగు కలిగి, ఒకచేతవజ్రాన్నీ-మరోచేతఅంకు శాన్నీ ధరించి వున్న రెండు చేతులుండిన, ఇంద్రప్రతిమను బంగారంతో చేయించి-ప్రాణప్రతిష్ఠా శోధనకళాన్యాసాదు లన్నీ పూర్తిచేసి- "అయంవోవిశ్వత" ఇత్యాది మంత్ర యుతంగా ధ్యానావాహనాది షోడశోపచారాలా పూజిం చాలి. ఈ అర్చనావిధిలో శ్రీగంధాన్నీ, పాటలీపుష్పాన్నీ, పసుపురంగు పట్టుబట్టనీ వుపయోగించాలి. చిత్రాన్నం నైవేద్యం చేయాలి. పూజానంతరం గాయత్ర్యాష్టోత్తర శతంతో- నెయ్యా-చిత్రాన్నాలను హోమం చేయాలి. గంధమాల్యాల్నీ నువ్వుల అన్నాన్నీ ఉత్తరదిక్కులో బలి చేయాలి. దీనివలన అరిష్టాలు హరించుకు పోతాయి, ఒక నెలలో సర్వసౌఖ్యాలూ కలుగుతాయి.

## తిధివార యోగాదీన్

జ్యేష్ఠా తార ఆదివారమయితే—రంధ్రయోగం
సోమవారం—శుభయోగం
మంగళవారం-మృత్యుయోగం
బుధవారం-సౌమ్యయోగం
గురువారం-పాడ్యమీతిధికూడా కలిసివస్తే విషయోగం
శుక్రవారం-నాశనయోగం
శనివారం-సిద్ధయోగం
నందాతిధులలో నిర్జీవయోగం
పుష్యమీ తార క్రూరగ్రహాయుతమై వుంటే మహా
శూలయోగం పాల్గుణం శూన్య యోగం

ఈ తారలో ఉత్పాతాలు కనుపించినట్లయితే-ప్రజలు విషంవల్లా,అగ్ని వల్లాఆయుధాలవలనాభయాన్ని పొందుతారు ఈ నక్షత్రంలో ఎరుపురంగు మేఘాలు కనుపిస్తే-వర్షం పడుతుంది. రవి సంక్రమణం వలన ధరలు మధ్యస్థంగా వుంటాయి.

## ప్రథమ రజస్వలా

జ్యేష్ఠలో తొలిగా పుష్పవతియైన కన్య చక్కటి పుత్రసంతానాన్ని పొందుతుంది.ఉత్తరార్థంలోరజస్వలయితే శాంతి చేయించాలి.

## ఇతరాన్

చెవులు కుట్టించడానికీ, క్షారకర్మలకీ, విషాగ్ని ప్రయోగాలకీ, అభిచారానికీ, మంత్రాదులకీ, శత్రుత్వం నడపడానికీ, చెడువ్యవహారాలకీ, యుద్ధాలకీ, రాయబారాలు పంపడానికీ చెడువ్యవహారాలకీ, అస్త్రశస్త్రాభ్యాసానికీ, మంత్రయంత్రాదుల ఉద్ధరణకీ, సేవకుల్ని చేర్చుకోవడానికీ, పశువులవ్యాపారానికీ-లేదా-పశువుల్ని అమ్మడానికి, దాచడానికీ-ఈ జ్యేష్ఠ సర్వశ్రేష్ఠం.

## జాతక గుణగణాది

జ్యేష్ఠానక్షత్రజాతకులు-నల్లనిశరీరచ్ఛాయగలవాళ్ళు పుత్రసంతానవంతులు, స్నేహశీలురు, సంతుష్టులు, సత్యవాదులు, ధృఢమైన చేతులు కలవాళ్ళు. స్త్రీలాలసులు పొడుగైన ముక్కు-కలవాళ్ళు, ఉదరప్రాంతంలో మత్స్యాంశ తిలకాదులుండేవాళ్ళు అవుతారు.

## పాదాంశాది

ఈ తారా ప్రథమపాదం గురువుది. ఉత్పన్నాంశ-ఈ వేళాసంజాతులు వాగ్రియసగాళ్లు, హాస్యగాళ్లు, గర్విష్ఠులుగా వుంటారు.

రెండోపాదం శనిది. ఉగ్రాంశ - నిత్యంరోగులు, పర వశీకరణా తంత్రులుగా వుంటారు.

మూడో పాదంకూడా శనిదే. ఇది పాపాంశ-అంగ వైకల్యం, మరీ అతిస్వల్పమైన భోగం, చూపుసరిగా ఆనక పోవడం నిత్యం ఇతరుల పనులు చేసిపెట్టడం-వీరి లక్షణాలు.

ఆఖరిపాదం గురుడిది. శుభాంశ, వీళ్ళు చెవిటివాళ్ళవు తారు. శాస్త్రవేత్తలవుతారు.

ఈ నక్షత్రజాతకుల జీవితాలు పదిహేడు సంవత్సరాల పరిధిగల బుధమహాదశతో ప్రారంభవుతాయి. తదుపరిది కేతు మహాదశ. అది యేడు సంవత్సరాలు.

జ్యేష్ఠా తారలో జన్మించకపోయినా -నో-యా- యీ యూ-అనే నాలుగక్షరాలలోనూ, ఏదో ఒక అక్షరంతో మొదలయ్యే పేరుగలవాళ్ళుకూడా - ఈ తార ప్రభావానికి లోనవుతారు.

జ్యేష్ఠా జాతులకి జననాది మూడవ సంవత్సరంలో జ్వర భయం, తొమ్మిదవయేట నాలుగుకాళ్ళ జంతువులవల్ల భయం, పదహారవయేట అగ్నిగండం, ఇరవయ్యవయేట అపమృత్యు భయం, ఇరవయ్యొనిమిదవయేట గుల్మరోగ భయం, నలభయ్యయిదవయేట అపమృత్యుభయం కలుగు తాయి. అతిక్రమణాత్-తొంభైతొమ్మిది సంవత్సరాలు పరమాయువు.

# మూల

ఇది కృష్ణవర్ణ నక్షత్రం. అయిదు తారలు సింహం ఆకారంలో కూడి వుంటాయి. నపుంసకనక్షత్రం రాక్షస గణం, శునక (కుక్క) యోని, అగ్రజాతి, ఉగ్రతార అధోముఖం, సులోచనం, పట్టణస్థానం వరుణ మండలం, ఏకాస్వర, విషమతార, అధి పక్షి చక్రవాకం, అధి వృక్షం వేగిస, అధి దైవం నిరృతి.

ఋక్షాది 20 ఘటికలవరం విషనాడి.

దక్షిణ పశ్చిమ దిశలుగా ప్రయాణానికి మంచిది.

ఈ తారలో జ్వరం ప్రాణాంతకం-లేదా - తొమ్మిది రోజులు అరిష్టం కలిగిస్తుంది. తచ్ఛాంత్యర్థంగా-

కారునలుపు శరీరచ్ఛాయ, రెండు చేతులూ కలిగిన నిరృతీ దేవతా విగ్రహాన్ని నలుపులోహం (ఇనుము)తో చేయించి-ప్రాణ ప్రతిష్ఠా, శోధన, కళాన్యాసాది కార్యక్రమాలు ముగించి-ధ్యానావాహనాది షోడశోపచార విధిని పూజించాలి. ఈ పూజని, "నిరృతీ దేవతానిలో" ఇత్యాది మంత్రాలతో చేయాలి. ఈ పూజకి ఎర్రని వస్త్రం, కృష్ణాగురుగంధం, తామర పువ్వులు-లేదా-కలువపువ్వులు, మేఘశృంగమనే ప్రత్యేక ద్రవ్యంతో ధూపం, ఎర్రరంగుతో

కూడిన మినుములతో వండిన ఆహారం నివేదనగానూ సమర్పించాలి.

పూజానంతరం - గాయత్ర్యాష్టోతర శతంతో కంద మూల ఫలాల్ని నేతితో హోమంచేయాలి, ఎరుపురంగుతో కూడిన మినుములతో కూడిన అన్నాన్ని నైరుతీ దిశలో బలి చేయాలి. తద్వారా-అరిష్టాలు తొలగి-తొమ్మిది రోజులలో సర్వసుఖాలు సంప్రాప్తిస్తాయి.

## తిథివారయోగాదీన్

మూలా నక్షత్రం -ఆదివారం-మృత్యుయోగం
సోమవారం - యమదంష్ట్రా యోగం
మంగళవారం - వరయోగం
బుధవారం - మృత్యుయోగం
గురువారం-ఆనాడు తిథి తదియ అయితే-
త్రిపుష్కర యోగం.
శుక్రవారం - దగ్ధయోగం
శనివారం - సుధాంశుయోగం-కాని,

శనివారంనాడు – మూలా నక్షత్ర ప్రథమ పాదం సుధాంశుయోగం, ద్వితీయపాదం నిర్జీవయోగం, తృతీయ

పాదంలో-ధనయోగం, చతుర్థపాదంలో మృత్యు యోగముగా గుర్తించాలి.

ఈ మూలా నక్షత్రం ఉన్నరోజున-పునర్వసు నక్షత్రం క్రూరగ్రహాయుక్తమయితే- మహాశూలయోగం అవుతుంది.

మాఘ మాసం శూన్యయోగం.

మూలానక్షత్రం ఉన్నప్పుడు పడమర దిక్కులో ఉత్పాతాలు కనుపించినట్లయితే అధిక పంటలు, అధిక పాడీ కలుగుతాయి. ఎరుపు రంగు మేఘాలు కనుపిస్తే వానలుంటాయి.

ఈ నక్షత్రంలో రవి సంక్రమణం జరిగితే- ధరలు పెరుగుతాయి.

## ప్రథమ రజస్వాలా ఫలం

మూలా నక్షత్రంలో తొలిగా రజస్వలయైన రమణి పుత్రసంతానవతి అవుతుంది.

## ఇతరాన్

ఋతు పుంసవన సీమంత నామకరణాన్న ప్రాశన, అక్షరాభ్యాసాలకీ, సమావర్తన, వివాహ, తైలాభ్యంగనాదులకీ, బంగారపు వస్తువుల వాడకం మొదలుపెట్టేందుకూ, యజ్ఞాది దీక్షలు తీసుకునేందుకూ, వైద్యారంభా

నికీ, పథ్యం పుచ్చుకోడానికీ, వ్యవసాయారంభానికీ, విత్తనాలు చల్లుకోవడానికీ, కొబ్బరి-పనస-నేరేడు చెట్ల పెంపకాలకీ, నూతులూ-చెరువులూ-దిగుడుబావులూ-యిత్యాదులకీ, సారంగ మార్గాలలో ప్రవేశానికీ, భూతోచ్ఛాటనవంటి మంత్రప్రయోగాలకీ, యాత్రలకీ, శ్రాద్ధాది కర్మకాండలకీ-ఈ మూలా నక్షత్రం మేలుచేస్తుంది.

## జాతక గుణగణాది

ఈ తారలో జన్మించినవాళ్ళు-ధర్మం తెలిసినవాళ్ళు, ధనవంతులు, అభిమానవంతులు, చుట్టపక్కాలమీద ప్రేమ కలవాళ్ళు, ఎఱుపురంగు శరీరఛాయ కలవాళ్ళూ, కాముకులు. దొంగతనంచేసే గుణం కలవాళ్ళూ, అతిరోగులు, చపలచిత్తులు, దయాంతఃకరణలున్న వాళ్ళూ, ఎరుపురంగు కళ్ళు కలవాళ్లూ, స్త్రీలచేత ఆకర్షింపబడేవాళ్ళుగా వుంటారు.

## పాదాంశాది

మూలాతార మొదటిపాదం-కుజుడిది. తస్కరాంశ. ఈ వేళా సంజాతులు తండ్రినెరగనివాళ్ళు, మూలశంకాది వ్యాధిగ్రస్తులు, దరిద్రులు అవుతారు.

రెండోపాదం-శుక్రుడిది - భోక్త్రాంశ - వీళ్ళు మాతృహీనులు, దయానిధులు, క్షీరాన్నంపట్ల — బెల్లంపట్ల —

లాలసులు. రవంత భోగం కలిగినవాళ్లూ, వాహనచారులు అవుతారు.

తృతీయపాదం-బుధుడిది. విచక్షణాంశ-ఈ జాతకులు ధనవంతులు, ఖర్చు మనుషులు, మంచి సంభాషణాపరులు, విద్యావంతులు, జ్యోతిషవిద్య తెలిసినవాళ్ళు, ఎదుటి వారితో వినయంగా ప్రసంగించేవాళ్ళుగా వుంటారు.

ఆఖరిపాదం-చంద్రుడిది. ధనాంశ-వీళ్ళు రాజోద్యోగులు, సేనాపతులు, పరోపకారులు, కాముకులు, రవ్వంత క్షయరోగ సూచనలున్నవాళ్ళు, ఆడవాళ్ళ కంఠస్వరాన్ని పోలిన గొంతు కలవాళ్ళు, మెత్తగా మాట్లాడేవాళ్ళు, లౌకికం తెలిసినవాళ్ళుగా వుంటారు.

ఈ చివరి పాదంలో రెండు ఘటికలకాలం అభుక్త దోషంతోకూడి వుంటుంది.

ఈ తారాజాతులుజననాది రెండవయేటగాని, మూడవ యేటగాని జ్వరభయం, ఇరవయ్యవయేట పైత్య జ్వర భయం, ముప్పయ్యవయేట చలిజ్వరభయం, యాభయ్యవ యేట ఆయుధ భయం,అరవయ్యవయేట అపమృత్యుభయం కలుగుతాయి. అన్నింటినీ అతిక్రమించ గలిగితే వీళ్ళ పర మాయుర్దాయం తొంభయి సంవత్సరాలుంటుంది.

మూలా తారలో జన్మించకపోయినా-యే, యో, బా, బీ,-అనే నాలుగక్షరాలతోనూ యేదో ఒక అక్షరంతో ప్రారంభమయ్యే పేరుగలవాళ్ళంతా-ఈ తారాప్రభావానికి లోనవుతారు.

# పూర్వాషాఢ

ఇది శ్వేతవర్ణం రెండుచుక్కలు దండాకారంలో విరాజిల్లుతుంటాయి. స్త్రీ తార. మనుష్యగణం, వానర యోని, బ్రాహ్మణ జాతి, చతుష్పాత్తు; అధోముఖి అంధలోచని, మహోగ్ర (అతిక్రోధ) తార, స్థానం గ్రామం, వాయు మండలం, చకారక్షరస్వరం. అధి పక్షి చిలుక, అధివృక్షం బచ్చలి, అధిదైవతం ఆపో దేవత (గంగ).

ఋక్షాది 14 ఘటికల పర్యంతర విషనాడి. ఈ సమయంలో ప్రయాణాలు చేయకూడదు. మంచినీళ్ళు గాని, పాలుగానీ మాత్రమే తీసుకోవాలి. పడమర, దక్షిణ దిక్కులుగా ప్రయాణాలకి ఈ తార మంచిది.

ఈ నక్షత్రంలోజ్వరాది సంక్రమణంవలన ప్రాణపీడ-లేదా-ఒకనెల అరిష్టం కలుగుతాయి. తచ్ఛాంత్యర్థం-

తెలుపురంగు కలిగి, రెండుచేతులు కలిగి, ఒకచేత అంకుశాన్ని ధరించి - మొసలి వాహనాన్ని అధిరోహించిన అపోదేవతా ప్రతిమని బంగారంతో చేయించి- తెలుపురంగు వస్త్రం, శ్రీగంధం, కలువపువ్వు, మనశ్శిలతో ధూపాన్ని

వినియోగించి - "యతిక్రించి ద్వరుణ" అనే మంత్రాదిగా షొడశోపచార పూజలు చేయాలి. క్షీరాన్నం నివేదించాలి.

పూజానంతరం-గాయత్ర్యాష్టోత్తరయుతంగా, ఎఱువు రంగులోవుండే శాలిబియ్యం-నేతితో సహా హోమం చేయాలి. కడగా గంధమాల్యాలనీ కృసరాన్నాన్నీ-తూర్పుదిక్కులలో బలిచేయాలి - ఇందువలన అరిష్టాలు హరిస్తాయి. ఒకనెల రోజులలో సర్వసౌఖ్యాలూ కలుగుతాయి.

## తిధివార యోగాదీన్

పూర్వాషాఢా—ఆదివారం—రాజయోగం

సోమవారం—ఉత్పాతయోగం

మంగళవారం-యమకంటకయోగం

బుధవారం—శుభయోగం

గురువారం—త్రయోదశీ తిథి యుక్తమయితే సిద్ధయోగం

శుక్రవారం—అమృతయోగం

శనివార—మృత్యుయోగం

రిక్తతిథులలో నిర్జీవయోగం.

ఆరుద్ర క్రూరగ్రహా స్తమయితే శూలయోగం.

శ్రావణమాసం శూన్యయోగం.

ఈ నక్షత్రంలో ఉత్పాత దర్శనంవలన- ధాన్యవృద్ధి, క్షీరసమృద్ధి కలుగుతాయి. ఈ తారలో రవి సంక్రమణం జరగడంవలన ధరలు మధ్యతరహాగా వుంటాయి.

## ప్రథమ రజస్వలా ఫలం

పూర్వాషాఢా తారలో ప్రథమ రజస్వలయైన కన్య భర్తృహీనురాలవుతుంది.

## ఇతరాన్

గణితశాస్త్రాభ్యాసానికి, ఆవుల్ని సంపాదించడానికీ, శాలివిత్తనాలు చల్లేందుకూ, చెఱుకు తోటలు ప్రారంభించేందుకూ, నూతులు, చెరువులు, దిగుడుబావుల నిర్మాణారంభాలకీ, జలస్తంభన-అదృశ్యత విద్యాభ్యాస ప్రారంభానికీ, విష ప్రయోగానికీ, అభిచారానికీ, కపటంతో కూడిన వాదనలకీ, దొంగతనానికి వెళ్ళేందుకూ, సారంగ ప్రవేశానికీ, తీర్థస్నానాదులకీ, శ్రాద్ధకర్మలకీ, అప్పులు తీర్చి చెల్లుచేసుకోవడానికీ- ఇది మంచి నక్షత్రం.

## జాతక గుణగణాది

పూర్వాషాఢలో పుట్టినవాళ్ళు రవంత పొడగరులై వుంటారు. చిన్న చిన్న వేళ్ళువుంటాయి. ఏపనిపడితే ఆపని చేసేవాళ్ళూ, బుద్ధిమంతులు, ఏ విషయాన్నయినా ఇట్టే తెలుసుకోగలవాళ్ళు, ప్రతిష్టావంతులుగా వుంటారు.

## పాదాంశాది

పూర్వాషాఢ ప్రథమ పాదం కలది-ఉత్పన్నాంశ-ఈ వేళాసంజాతులు ఎర్రని నేత్రాలు కలిగివుంటారు. అమిత శూరత్వం కలిగి వుంటారు. సుఖం తక్కువ.

ద్వితీయ పాదం బుధుడిది—అభయాంశ-ఈ జాతకులకు పెద్ద ఉదరం వుంటుంది, వాగుడుకాయలుగా వుంటారు. అయినా చాలా మృదువుగా మాట్లాడతారు. అవతలివాళ్ళ లోని సద్గుణాలని పసిగట్టగలుగుతారు.

తృతీయ పాదం శుక్రుడిది-భాగ్యాంశ-వీళ్ళు నిత్యం శుచిగావుంటారు. దయాహృదయులు, భాగ్యవంతులు. కాని చపలచిత్తులు.

చతుర్థపాదం కుజుడిది-ఉగ్రాంశ-ఖండితద్వేషం, ఉగ్ర స్వభావం, పాపకార్యాసక్తత, అబద్ధాలాడడం వీళ్ళ స్వభావంగా వుంటుంది.

ఈ జాతకులకి ఇరవై సంవత్సరాల వ్యవధికలిగిన శుక్ర మహాదశలో జీవారంభం యేర్పడుతుంది. తదుపరి రవిదశ ఇది ఆరు సంవత్సరాలు.

ఈ నక్షత్రంలో జన్మించకపోయినా-బూ-ధా-భా-ఢా -అనే నాలుగక్షరాలలోనూ-యేదో ఒకఅక్షరంతో ప్రారంభ మయ్యే పేరుగలిగిన వాళ్ళందరిమీదా ఈ నక్షత్ర ప్రభావం వుంటుంది.

పూర్వాషాఢలోపుట్టినవారికి జననాదిగా- మొదటినెల అగ్నిమాంద్యజ్వరభయంకాని-పుండ్లవలన అనారోగ్యభయం కాని వుంటుంది. ఆరు నెలలో చలిజ్వరంవలన భయం కలుగుతుంది. పన్నెండవయేట, పదహారవయేట నీటిగం డాలు ముప్ఫయ్యో సంవత్సరంలో చలిజ్వరం. అరవయ్యవ యేట అపమృత్యుభయం. అన్నీ అధిగమిస్తే-98 సంవత్స రాలు పరమాయుర్దాయం.

# ఉత్తరాషాఢ

ఎఱుపురంగు నాలుగు నక్షత్రాలు మంచపుకోళ్ళ ఆకారంలో వుంటాయి. స్త్రీలింగం. మనుష్యగణం బభ్రు (ముంగిస) యోని, ఊర్ధ్వముఖం, త్రిపాత్తు, స్థానం, శూన్యం. ఇంద్రమండలం, ఏకారస్వర, అధితార, అధిపక్షి కోకిల, అధివృక్షం పనసచెట్టు, అధిదైవతం విశ్వేదేవతలు.

ఋక్షాది విశంతి ఘటికాత్పరం విషనాడి.

పశ్చిమ దక్షిణ దిశలుగా ప్రయాణాలకి శ్రేష్ఠం.

ఈ నక్షత్రంలో జ్వరపడడం వలన-ఒక నెలపాటు అరిష్టం కలుగుతుంది. తచ్ఛాంతికోసం –

అక్షసూత్ర కమండులాదులు ధరించిన నాలుగు చేతులు కలిగిన, శ్వేతవర్ణమయమైన విశ్వేదేవతల స్వర్ణవిగ్రహాన్ని చేయించి-ఆరాధించాలి. 'విశ్వేదేవాస' అనే మంత్రంతో - శ్వేతవస్త్రం, శ్రీగంధం, అయిదురంగులపువ్వులు, ఆమలక ధూపాలతో షోడశోపచారవిధంగా అర్చించి పంచభక్ష్యా లనీ నివేదించాలి. అనంతరం గాయత్ర్యాష్టోత్తరయుతంగా పెసరపప్పు అన్నాన్నీ నేతితో హోమం చేయాలి. తుదిగా గంధమాల్యాదుల్నీ పెసరపప్పు అన్నాన్నీ ఉత్తరదిక్కులో బలిచేయాలి. దీనివలన అరిష్టాలువారించి ముప్ఫయిరోజులలో మేలు జరుగుతుంది.

## తిధివార యోగాదీన్

ఉత్తరాషాఢ-ఆదివారం మృత్యుయోగం

సోమవారం - మృత్యునాసికాయోగం

మంగళవారం - చిత్రయోగం-ఆరోజు పంచమీతిధి కలిస్తే శుభయోగం

బుధవారం-సౌమ్యయోగం

గురువారం-విష యోగం

శుక్రవారం-సిద్ధ యోగం

శనివారం-విష యోగం.

తత్కాలానికి మృగశిర క్రూరగ్రహయుక్తమయితే మహాశూల యోగం

వైశాఖం శూన్య యోగం

ఈ నక్షత్రంలో ఉత్పాతదర్శనాలవలన-కరువు కాటకాల భయం కలుగుతుంది. రవి సంక్రమణం వలన- ధరలు మధ్యస్థంగా వుంటాయి.

## ప్రథమ రజస్వలా ఫలం

ఉత్తరాషాఢ తారలో ప్రథమ రజస్వలయైనపడుచుది ఉత్తమురాలు, ధర్మ పరాయణురాలూ అవుతుంది.

## ఇతరాన్

ఋతుపుంసవన సీమంత నామకరణాన్న ప్రాశన చౌలోప నయన వేదశాస్త్రాభ్యాస సమావర్తన వివాహ తైలాభ్యంగనాదులకీ, క్షౌరకర్మలకీ, క్రొత్తబట్టలు కట్టుకోడానికీ, క్రొత్తనగలు పెట్టుకోడానికీ, రాజ్యాభిషేకానికీ, గ్రామాలు నగరాలు నిర్మాణార్థం శంకుస్థాపనలు చేయడానికీ, వ్యాధుల నుంచి తెమిలాక తొలిస్నానం చేయడానికీ- ఈ నక్షత్రం శ్రేష్టం.

16)

## జాతక గుణగణాది

ఉత్తరాషాఢలో జన్మించినవాళ్ళు శుచిమంతులు, సర్వ విషయాలు తెలిసినవాళ్ళు, ఎక్కువ సద్గుణాలు కలవాళ్లూ, అతిథుల్ని గౌరవించే ఆనవాయితీ కలవాళ్ళు, హాస్యప్రియులు, పుత్రసంతానం కలవారూ, దయాహృదయులు, వినయంతో కూడిన వాక్ సంపన్నులు, శూరులు, పెద్దముక్కు కలవారూ, ముక్కులోనూ—గుహ్యస్థానం వద్దా మత్స్యాంక తిలకాదులుండేవారూ అవుతారు.

## పాదాంశాది

ఈ ఉత్తరాషాఢ ప్రథమపాదం గురువుది. ఉత్పన్నాంశ. ఈ వేళా సంజాతులు-బుద్ధిమంతులు, శాస్త్రవేత్తలు, ఆస్తికులు, గురుభక్తులు,స్వధర్మ పాలనానిరతులు అవుతారు

ద్వితీయపాదం శనిది-పాపాంశ. ఈ జాతకులు పనికిరాని పనులు చేయడంలో ఘనులు. ఇతర మతాలపట్ల ప్రేమాభిమానాలు కలవాళ్ళుగ వుంటారు.

తృతీయ పాదం కూడా శనిదే- ఇది ఉగ్రాంశ. స్థూల శరీరులు, అల్పసంతోషులు,నిత్యం వ్యాధిగ్రస్తులుగాఉంటారు

చతుర్థ పాదం గురువుది-శోభనాంశ. వీళ్ళు సర్వస్య శుభప్రాపులు. నిత్యం ఏదో ఒక పని చేసేవారూ, శాస్త్రార్థ చర్చా వ్యాపారులు, ఉత్సాహవంతులుగా వుంటారు.

ఈ తారాజాతుల జీవనం ఆరు సంవత్సరాల అవధి కలిగిన రవి మహాదశతో ఆరంభమవుతుంది. తరువాతిది చంద్రదశ-అది పది సంవత్సరాలు,

సరాసరి ఈ తారలో జన్మించకపోయినా బే-బో-జా-జి-అనే అక్షరాలలో యేదో ఒకదానితో మొదలయ్యే పేరు గలవాళ్ళంతా ఈ తారా ప్రభావానికి లోనయ్యే వుంటారు.

ఇక, ఈ నక్షత్రంలో జన్మించినవాళ్ళు జననాది పన్నెండవరోజున వాతజ్వర భయం అయిదవయేట వ్యాధుల వలనా, అగ్నివలనా, ఆయుధాలవలనా భయం- ఇరవయ్యోని మిదో యేట భయంకరవ్యాధి లేదా ఆయుధాలవలనా దెబ్బలూ కలుగుతాయి. నలభయ్యవయేట కంటక భయం, ఎనభయ్యవ సం॥ కంటి వ్యాధులపీడ. ఆ సంవత్సరం కన్యా (భాద్రపద-ఆశ్వీయుజ మాసంలో ఆదివారం బహుళ చతుర్థశి స్వాతీ నక్షత్రమయితే పధ్నాలుగో ఘటికలో విషూచీ వ్యాధివల్ల అపమృత్యువు. తప్పితే 80 సంవత్సరాలు పరమాయువు.

# శ్రవణం

ఇది కృష్ణ వర్ణ నక్షత్రం. మూడు తారలు చేవ ఆకారంలో విరాజిల్లుతుంటాయి. పురుష తార. దేవగణం వానరయోని, ఊర్ధ్వ ముఖం. సూర్యతార, ధృవతార, అంధలోచనం, బాహ్యం, ఓంకార స్వరం, అధిపక్షి జల (సముద్ర) పక్షి, అధి వృక్షం రావిచెట్టు. అధి దైవం విష్ణుమూర్తి.

ఋక్షాది పదిఘటికల పరంలో విషనాడి.

అన్ని దిక్కుల ప్రయాణాలకీ అనుకూలమైన తార.

ఈ నక్షత్రంలో వ్యాధి సంక్రమణంవలన పదకొండు రోజులు అరిష్టం పడుతుంది. తచ్ఛాంత్యర్థంగా—

శంకచక్ర పద్మాలను ధరించి, ఒకచేత అభయ ముద్రని వహించి, గరుడ వాహనారూఢుడైన చతుర్భుజ విష్ణువును కృష్ణలోహంతో ప్రతిమగామలచి-కుంకుమ కస్తూరీ గంధం, ఎరుపు వస్త్రం, తులసీ దళాలు, దశాంగ గుగ్గులు ధూపాలతో — "ఇదం విష్ణుః" అనే మంత్రయుక్తంగా షోడశోపచార విధిని ఆరాధించి, శాలి అన్నాన్ని నైవేద్యం చేయాలి. అనంతరం గాయత్ర్యాష్టోత్తరంతో రావిసమిధల్నీ బియ్యాన్నీ నేతితోకలిపి హోమంచేయాలి.గంధమాల్యాలనీ

క్షీరాన్నాన్ని ఉత్తర దిక్కులో బలిచేయాలి. తద్వారా అరిష్టాలుతొలగిపదకొండురోజులలోసుఖసౌఖ్యాలుసంభవిస్తాయి

## తిధివారయోగాదీన్

శ్రవణానక్షత్రం ఆదివారం–సిద్ధయోగం

సోమవారం–అష్టమితో కూడి నాశనయోగం

మంగళవారం - మృత్యుయోగం

బుధవారం-నిర్జీవయోగం

గురువారం- సిద్దయోగం

శుక్రవారం–నాశనయోగం

శనివారం-యమకంటకయోగం

నందా తిధులలో నిర్జీవయోగం

మఖానక్షత్రం క్రూరగ్రహాన్వితమైతే - మహాశూలయోగం. మఘమాసం శూన్యయోగం.

ఈ నక్షత్రంలో ఉత్పాత దర్శనంవలన కరువుకాటకాలేర్పడతాయి. రవి సంక్రమణం వలన ధరలు మధ్యతరహాగా వుంటాయి.

## ప్రధమ రజస్వలా ఫలం

శ్రవణంలోతొలి సమర్త జరిగిన బాల-పుత్రసంతాన వంతురాలవుతుంది.

## ఇతరాన్

ఋతు పుంసవన సీమంత నామకరణాన్న ప్రాశనలకీ చెవులు కుట్టించడానికీ, చౌలోపనయన వివాహ అక్షరా భ్యాసానికీ, వేద శాస్త్రాభ్యాసానికీ, క్రొత్త బట్టలు- క్రొత్త నగలూ వాడకం ప్రారంభించడానికీ; రాజ్యాభిషేకానికీ క్రొత్తగా యేదైనా ఊరిలో ప్రవేశించడానికీ, విష్ణుప్రతిష్ఠకీ విష్ణువ్రతారంభానికీ, యజ్ఞాదులికీ, తన్నిమిత్త పశుబంధ నాదులకీ, హోమాలకీ, శాంతి కర్మలకీ, పౌష్ఠిక కర్మలు చేయడానికీ, గ్రహమంత్రోచ్చాటనలకీ, మంత్ర శాస్త్రా భ్యాసానికీ, వ్యవసాయారంభానికీ, విత్తనాలు చల్లడానికీ; యాత్రలకీ, క్షౌర కర్మలకీ, వైద్యాలకీ, పథ్యస్నానానికి, శ్రాద్ధ కర్మలకీ ఈ నక్షత్రం చాలా మంచిది.

## జాతక గుణగణాది

ఈ తారలో జన్మించిన వాళ్ళు—చిత్రమాల్య సుగంధ ప్రియులు, స్థూలకాయులు, సుభగులు, పరస్త్రీ లాలసులు, బంధువులకీ - ఆశ్రితులకీ ప్రియం కలిగించేవాళ్ళూ, ఉదార

గుణం కలవాళ్ళు, వాగుడు కాయలు, భోగవంతులు, విదేశ యాన నిమగ్నులు, వివేకవంతులు, చపలురు గుహ్య ప్రాంతంలో తిలక మత్స్యాంకితాలు కలవాళ్లూ గావుంటారు.

## పాదాంశాది

శ్రవణతారప్రథమపాదంకుజుడిది. మంగళాంశ-గుల్మ రోగులు, కలహ ప్రియులు, పుత్రసంతానం లేనివాళ్ళు అవుతారు.

ద్వితీయ పాదం శుక్రుడిది. భోక్త్రాంశ - అనేకమంది సేవకులు కలవాళ్ళు, తంత్రవిద్యావేత్తలు, కాముకులూ అవుతారు.

తృతీయ పాదం బుధుడిది. విచక్షణాంశ- ఈ జాతకులు అత్యంత ఉదారస్వభావులు, చిత్రలేఖకులు, కలహప్రియు లుగా వుంటారు.

నాలుగవపాదం చంద్రుడిది. ధనాంశ-ఈ వేళానంజా తులు పశువుల్ని అమ్మడంలో నిపుణులు, యోగులూ, ధార్మికులూ అవుతారు. పొడుగాటి ముక్కు కలిగివుంటారు.

ఈ జాతకుల జీవనం పదిసంవత్సరాల పరిధి కలిగిన చంద్రమహాదశతో మొదలవుతుంది. తరువాతిది కుజదశ - అది యేడు సంవత్సరాలు.

ఈ తారలో జన్మించకపోయినా

జూ-జే-జో-ఘా- అనే నాలుగక్షరాలలోనూ ఏదో ఒక అక్షరంతో మొదలయ్యే పేరుగలవాళ్ళు ఈ నక్షత్ర ప్రభావాన్ని చవిచూస్తారు.

శ్రవణంలో జన్మించినవాళ్ళు-జననాది రెండవయేట రోగ భయం, మూడవఏట సర్పగండం, అయిదవయేట అగ్నిగండం, ఏడవ సం॥ ఆయుధ పీడ, పదమూడవ సం॥ జ్వరభయం-అపమృత్యుభయాలనుయెదుర్కో-వలసివస్తుంది. యాభయ్యవ సం॥ కంటకం.

మిధున (జ్యేష్ట-ఆషాడ) మాసం, ఆదివారం బహుళ ఏకాదశీతిధి శ్రవణా నక్షత్రంకూడినరోజున సూర్యోదయాది సప్తఘటికా సమయం జ్వరం వలన అపమృత్యువు. అధిగమించితే-తొంభై సంవత్సరాలు పరమాయువు.

# ధనిష్ఠ

శ్వేతవర్ణం. మద్దెల ఆకారంలోవుంటుంది. మూడు తారలు, స్త్రీలింగతార. రాక్షస గణం. సింహయోని. సూర్యతార. ద్విపాది. ఊర్ధ్వముఖి, అంధలోచని, గ్రామ స్థానం ఇంద్రమండలం, అధిపక్షి భ్రమరం. అధివృక్షం జువ్వి. అధిదైవతం వసవులు.

ఋక్షాది దశఘటికా పరం విషనాడి.

అన్ని దిక్కుల ప్రయాణానికీ అనుకూలమైన తార.

ఈ తారలో వ్యాధి యేర్పడితే పదిహేను రోజులు అరిష్టం. తచ్ఛాంత్యర్థంగా-

శ్వేతవర్ణం, చతుర్భుజం, లాంగూల పద్మాభయ పాణీయుతం, పీతవస్త్ర సంహితంగా వసువుల స్వర్ణ విగ్రహాన్ని చేయించి -

చందనగంథం, జాజి పువ్వులు, గుగ్గులు ధూపాలతో సవితృమండల మంత్రయుక్తంగా షోడశోపచారాల పూజించాలి. పాయసాన్నం నివేదించాలి. అనంతరం గాయత్ర్యాష్టోత్తరంతో మేడి సమిధలూ నెయ్యితో హోమం చేయ్యాలి. కడగా గంధమాల్యాలనీ పెసరపప్పుఅన్నాన్ని ఉత్తరదిక్కులో బలిచెయ్యాలి. దీనివల్ల అరిష్టాలు గడిచి - ఆరోగ్యం సుఖం కలుగుతాయి.

## తిథివారయోగాదీన్

ధనిష్ఠా ఆదివారం-ఉత్పాతయోగం

సోమవారం-నిర్ధనయోగం

మంగళవారం-మృత్యుయోగం

బుధవారం-వరయోగం

గురువారం-వరయోగం

శుక్రవారం-నాశనయోగం

శనివారం-యమకంటకయోగం

పౌర్ణమీ తిథినాడు_నిర్జీవయోగం

ఆశ్లేషా తార క్రూరగ్రహాయుతమయితే - మహా శూలయోగం

ఆషాఢ మాసం శూన్యయోగం

ధనిష్ఠా నక్షత్రాన, వాయువ్య దిశలో ఉత్పాతాలు కలిగితే-దేశానికి సుభిక్షం యేర్పడుతుంది. ఎట్టిటి మేఘం కనిపిస్తే వర్షాలు పడతాయి.

## ప్రధమ రజస్వలాఫలం

ఈ తారలో తొలిరజస్వలయైన యువతి పుత్రసంతానవతి అవుతుంది,

## ఇతరాన్

స్త్రీ సంగమ నామకరణాన్నప్రాశనలకీ, చెవులు కుట్టడానికీ, చౌలోపనయనాలకీ, అక్షరాభ్యాసం—లేదా-విద్యాప్రారంభానికీ, తైలాభ్యంగన స్నానానికీ, క్షౌర కర్మలకీ, నూతన వస్త్రాభరణధారణకీ, అభిషేకానికీ, గుఱ్ఱాలు మొదలైనవి అధిరోహించడానికీ, ఛత్రచామరా (గొడుగు-విసనకర్ర)లు వాడకంప్రారంభించడానికీ, దేవతా

ప్రతిష్టకీ, గృహప్రవేశానికీ, యాత్రారంభానికీ, సంగీతాభ్యాస (గాత్రం వాద్యాలు ఉభయముకూడా) ప్రారంభానికీ, నాట్యశాస్త్రాభ్యాసారంభానికీ, పశువులని అమ్మేందుకు కొనేందుకు, వైద్యారంభానికీ-శ్రేష్ఠ-ఈ ధనిష్ఠ.

## జాతక గుణగణాది

ధనిష్టా జాతకులు తేజోవంతులు గుణవంతులు, ఉద్యోగవంతులూ, దయాహీనులు, బ్రహ్మద్వేషులూ, వేడి శరీరతత్త్వం కలవాళ్ళు, లోభులూ, పెద్దపెద్ధపాదాలు కలవాళ్ళు, స్థూల శరీరులుగా వుంటారు.

## పాదాంశాది

ధనిష్ఠ ప్రథమపాదం-రవిది-రాజాంశ-ఈ వేళా సంజాతులు స్థూలకాయులుగా వుంటారు.

ద్వితీయపాదం - బుధుడిది - సౌమ్యాంశ - విశయం ఉట్టిపడేలా మాట్లాడతారు. విద్యావంతులవుతారు.

మూడో పాదం-శుక్రుడిది-అభయాంశ-గుణవంతులు, చిరాయుష్మంతులు, కాలపేత్తలుగా వుంటారు.

నాలుగోపాదం -కుజుడిది- క్రూరాంశ- ఈ జాతకులు నిత్యం పాపకర్మలు చేయడంలో లీనమైవుంటారు.

ఈ తారా జాతుల జీవనం ఏడు వర్షాల అవధిగలిగిన కుజమహాదశతో మొదలవుతుంది. తరువాతిది రాహుమహా దశ. అది పద్ధెనిమిది సంవత్సరాలు.

ధనిష్ఠలోనే జన్మించక పోయినా-గా-గీ-గూ-గే-అనే నాలుగక్షరాలలో దేనితోనైనా ప్రారంభమయ్యే పేరుగల వాళ్ళందరిమీద ఈ నక్షత్ర ప్రభావం వుంటూనేవుంటుంది.

ధనిష్ఠలో జన్మించినవారికి జననాది-పద్ధెనిమిదిరోజులు జ్వర భయం, అయిదవయేట పునః జ్వరపీడ, పద్ధెనిమిది-ఇరవయ్యయిదు సంవత్సరాలలో వాతజ్వరపీడ, నలభయ్యవ యేట వివిధ వ్యాధుల భయం-లేదా-కొమ్ములుగల జంతువుల వల్ల భయం, యాభయ్యవయేట జలగండం. అరవయ్యవ యేట అపమృత్యుభయం. అధిగమించితే 88 సంవత్సరాలు పరమాయువు.

## శతభిషం

రక్తవర్ణం. ఒంటె ఆకారంతో కూడిన మూడు నక్షత్రాల కూటమి-అగ్నిజాతి దీనినే 'శతతార' అని కూడా అంటారు. నపుంసకలింగం. రాక్షసగణం. తురగీ (గుఱ్ఱం) యోని, అంతరిక్షం, విషమతార, శూన్యస్థానం, వరుణ మండలం, మందలోచనం, ఓంకారస్వరం, అధిపక్షి కోకిల, అధివృక్షంచంద్ర, అధిదైవం వరుణుడు.

బుక్షాది అష్టాదశ ఘటికాత్పరం విషనాడి.

అన్ని దిశల ప్రయాణాలకీ అనుకూలమైన తార.

ఈ నక్షత్రంలో జ్వరపడితే-పదిరోజులు అరిష్టం,

తచ్ఛాంత్యర్థం-

రెండు చేతులా పాశ కమండాలాలను ధరించి, మకర వాహనారూఢుడై వున్న శ్వేతవర్ణ వరుణ విగ్రహాన్ని స్వర్ణంతో చేయించి-"ఇమం మేవరుణ" ఇతి మంత్ర పూర్వకంగా శ్వేతవస్త్రం, మలయజ గంధం-నీలోత్పలం-ఘృత గుగ్గులుధూపాలుపయోగిస్తూషోడశోపచారవిధిగా పూజించి నెయ్యీ మాంసం నివేదించాలి.

అనంతరం గాయత్ర్యష్టోత్తరంతో -తేనె, సమిధలూ, నెయ్యి హోమంచేయాలి. కడగా-గంధమాల్యాలూ-పాలూ అన్నాలను ఉత్తరదిక్కులో బలిచేయాలి. దానివలన అరిష్టాలు తొలగి పదిరోజులలో సుఖసౌఖ్యాలు ప్రాప్తిస్తాయి.

## తిధివార యోగాదీన్

శతభిషం ఆదివారం—విషయోగం

సోమవారం—నందాతిధి యుక్తమైతే వరయోగం

మంగళవారం-మృత్యుయోగం

బుధవారం-ఆనందయోగం
గురువారం-శుభయోగం
శుక్రవారం షష్టితిథితో కలిస్తే-త్రిపుష్కరయోగం
శనివారం-కంటకయోగం
స్వాతీనక్షత్రం క్రూరగ్రహాయుతమైతే మహా శూల యోగం
ఈ తారలో ఉత్పాతాలు కనపడటంవలన-దేశం పాడిపంటలతో సుఖపడుతుంది.

## ప్రథమ రజస్వలా ఫలం

శతతారలో సమర్తయిన చెలువ-పుత్రసంతానవతి అవుతుంది.

## ఇతరాన్

స్త్రీ సమాగమ, నామకరణాన్న ప్రాశన చౌలోపనయనాక్షరభ్యాస వేదశాస్త్రాభ్యాస, తైలాభ్యంగ క్షౌర, భైషజ్య ఆరోగ్యస్నాన, రాజ్యాభిషేక, గజాశ్వా(వాహనా)రోహణ, దేవతాప్రతిష్ట, అమ్మకాలు, కొనుగోళ్ళు, వాణిజ్యారంభం, వ్యవసాయం, ప్రయోగం, అంజనాది ప్రయోగాలకు ఇది ఉత్తమతార.

## జాతక గుణగణాది

శతతారాజాతులు-లోకమాన్యులు, పుత్రసంతానం

అధికంగాగలవాళ్లూ, బంధువర్గాలకి ఉపకారులు, శత్రు విష యంలోకూడా శాంతచిత్తంతో వుండగలవాళ్ళూ, చిరాయు ర్దాయవంతులు, సరసులు, వ్యవహారాలు నడపగల విజ్ఞులు పెద్ద చేతులు కలవాళ్ళూ, కాస్తంత అధ్యాత్మికజ్ఞానం తెలిసిన వాళ్ళూ, వాగుడుకాయలు, పొడుగైన ముక్కు కలవాళ్ళూ, రక్త సంబధిత వ్యాధిగ్రస్తులుగా వుంటారు, శరీరపు ఎడమ భాగంలో తిలకమత్స్యాంకాలు కలిగి వుంటారు.

## పాదాంశాది

శతభిషం మొదటి పాదం గురుడిది. ఉత్పన్నాంశ. ఈవేళా సంజాతులు గోబ్రాహ్మణ పూజారతులూ, సత్య వాదులు స్థితప్రజ్ఞులు, శుభనిర్వాహకులు, అభిమానవంతులు స్నేహశీలురూ, అయి వుంటారు.

ద్వితీయపాదం శనిది, పాపాంశ—వీళ్ళు పిఱికివాళ్ళుగా వుంటారు.

తృతీయపాదం కూడా శనిదే. ఇది భయాంశ-ఈజాత కులు పుత్రసంతానవంతులు, పండితులు, అయినప్పటికీ— పాపచింతనాపరులు, ఉగ్రకర్మలు చేసేవాళ్ళూ, మంద బుద్ధులూ అవుతారు.

నాలుగో పాదం గురుడిది. సౌమ్యాంశ. వీళ్ళు స్నేహశీలురూ, పండితులు, అభిమానవంతులు, యజ్ఞకార్యలగ్నులూ అవుతారు,

ఈ తారాజాతుల జీవనం పద్దెనమిది వర్షాల వరిధి గలిగిన రాహుమహాదశతో ప్రారంభమవుతుంది. తరువాతిది గురు మహాదశ. అది పదహారు సంవత్సరాలు.

ఈ నక్షత్రంలో జన్మించకపోయినా-గో -సా-సీ- సూ అనే నాలుగక్షరాలలో దేనితోనయినా మొదలయ్యే పేరు గలవారూ ఈ తారాప్రభావానికి లోనయ్యే వుంటారు.

శతభిషంలో జన్మించినవారూ జననాది మూడవఏట జ్వర భయం, ఇరవైనాల్గవ ఏట రోగ - శత్రుభయాలు. నలభయ్యవ ఏట అగ్ని మాంద్య జ్వరభయం, యాభై మూడవ ఏట అపమృత్యుభయం, పునః అరవై మూడవ ఏట అపమృత్యు భయం-యెదుర్కోవాలి. ఈ గండాలన్నీ అతిక్రమిస్తే ఎనభై సంవత్సరాలు పరమాయువు.

# పూర్వాభాద్ర

రెండు నక్షత్రాలు-ఖడ్గాకారంలో కూడివున్నదే పూర్వాభాద్రతార. ఇది కృష్ణ వర్ణం. పురుష తార. మనుష్య గణం. సింహ యోని. బ్రాహ్మణ జాతి, సూర్య తార. త్రిపాత్తు. అధోముఖం. మధ్యలోచనం. ఉగ్ర

నక్షత్రం, పట్టణస్థానం, వాయుమండలం, ఓంకార స్వరం, సమతార, అధిపక్షి పావురం, అధివృక్షం బూరుగుచెట్టు, అధిదైవం అజైకపాత్.

ఋక్షాది షోడశ ఘటికాత్పరం విషనాడి.

తూర్పు, ఉత్తర దిక్కుల ప్రయాణానికిది శుభతార.

ఈ నక్షత్రంలో జ్వరం కలిగితే ప్రాణాంతకమవుతుంది. ముఖ్యంగా-ఆ రోజు పాడ్యమి, చవితి, షష్ఠి, అష్టమి, ద్వాదశీ తిథులలో ఒకటయివుండి, ఆదివారం కాని-మంగళవారం కాని అయ్యి-జ్వరం తగిలిన లగ్నం కన్యాలగ్నమయితే-అత్యంత ప్రమాదం.

అక్ష సూత్రదండకమండలు పాశదండాలతో కూడిన చతుర్భుజయుక్త అజైకపాత స్వర్ణవిగ్రహం చేయించి-"శన్నో దేవి" మంత్రయుక్తంగా షోడశోపచారాలా పూజించాలి. ఈ పూజలో ఎర్రని వస్త్రాన్ని, కుంకుమ గంధాన్ని, అర్క (జిల్లేడు) పువ్వు, గుగ్గులు ధూపం తప్పని సరిగా ఉపయోగించాలి. దధ్యోజనం నైవేద్యం చేయాలి. అనంతరం-గాయత్ర్యాష్టోత్తరంతో - నెయ్యి గుమ్మడి హోమం చేయాలి. అటుమీాదట గంధమాల్య దధ్యోజనాలని ఉత్తర దిక్కులో బలి చేయాలి. తద్వారా అరిష్టాలు తొలగి, ఒక నెలలో సర్వసౌఖ్యాలు సిద్ధిస్తాయి.

18)

## తిధివారయోగ ఫలాదీన్

పూర్వాభాద్ర ఆదివారం—స్థిరయోగం
సోమవారం-నాశనయోగం
మంగళవారం-మృత్యుయోగం
బుధవారం-సౌమ్యయోగం
గురువారం-నాశనయోగం
శుక్రవారం-మృత్యుయోగం
శనివారం-మరణయోగం

భద్రా తిధులలో నిర్జీవయోగం

చిత్రాతార క్రూరగ్రహాయుతమైతే మహాశూల యోగం.

ఆశ్వీయుజమాసం శూన్యయోగం.

వాయుమండలంలో ఉత్పాతాలు కలిగితే-పాడిపంటలతో దేశ క్షేమం. ఈ తారలో రవి సంక్రమణం జరిగితే-ధరలు మధ్యతరహాగా వుంటాయి.

## ప్రథమ రజస్వలాఫలం

పూర్వాభాద్ర మొదటి పాదంలోగాని, రెండవ పాదంలోగానీ తొలిసమర్తయయిన చెలువ దరిద్రురాలవుతుంది.

నాలుగో పాదంలో పుష్పవతి అయితే-చారుశీలగా భాసిల్లుతుంది,అయినప్పటికీ-ఈ తారలో పెద్దమనిషి కావడం మంచిది కాదు. అందుకా్కరణం పూర్వాభాద్ర తారలో ప్రథమ రజస్వలయైన పడతి-"భర్తృహీన" అవుతుంది.

## ఇతరాన్

చెరువులూ, నూతులూ, దిగుడు బావులూ త్రవ్వ డానికీ, మంత్ర తంత్ర యంత్ర ప్రయోగాలకీ, ధాతువాదాది క్రూర కార్యాలకీ-ఈ తార ప్రశస్తం.

## జాతక గుణగణాది

పూర్వాభాద్రలో పుట్టినవాళ్ళు-అత్యంత ఉదార స్వభావులూ, జ్ఞానవంతులూ, వినయవంతులు, పుత్రసంతా నం అధికంగా కలవాళ్ళూ, పొడుగైన నాలుకకలవాళ్ళూ, ఉత్కృష్టమైన పనులు చేయడంలో యిష్టంగలవాళ్ళూ, పొడగరి శరీరంగలవాళ్ళూ, ముఖమందునా-గుహ్య స్థానం లోనూ తిలక మత్స్యాంకాలున్నవాళ్ళూ అవుతారు. చెవి రోగాలుంటాయి.

## పాదాంశాది

పూర్వాభాద్ర ప్రథమపాదం-కుజుడిది- సేవాంశ- ఈ వేళాసంజాతులు ఉద్యోగస్థులు, విష్ణుపూజాపరులు, భోగు లుగా వుంటారు.

ద్వితీయ పాదం-శుక్రుడిది-భోగాంశ- సాహసవంతులు, మంత్రోపాసకులు, రాజవిరోధులూ అవుతారు.

తృతీయ పాదం-బుధుడిది-విచక్షణాంశ-ఈ జాతకులు పితృప్రియులు, సుఖవంతులు, జ్ఞానులు, భోగులుగా వుంటారు.

నాలుగో పాదం చంద్రుడిది-ధనాంశ - స్త్రీ లాలసులు, అందరిచేత పూజింపబడేవాళ్ళూ, ధనవంతులు, మాతృసేవా తత్పరులూ అవుతారు.

ఈ జాతకుల జీవనం పదహారు సంవత్సరాల పరిధిగల గురు మహాదశతో ప్రారంభమవుతుంది. తదుపరిది శని మహాదశ. అది పందొమ్మిది సంవత్సరాలుంటుంది.

ఈ నక్షత్రంలో పుట్టకపోయినా-సే-సో-దా-దీ- అనే అక్షరాలలోఏదో ఒక అక్షరంతో ప్రారంభమయ్యే పేరున్న వాళ్ళంతా ఈ తారాప్రభావాన్ని చవిచూసేవాళ్ళేఅవుతారు.

మొత్తంమీద ఈ పూర్వాభాద్రలో పుట్టినవాళ్ళు-జననాది-పన్నెండు రోజులు వాతపీడ, మూడవయేట జ్వర పీడ, నాలుగవయేట నీటిగండం, ఎనభయ్యవయేట అప మృత్యుభయం. అది గడిస్తే తొంభయి సంవత్సరాలు పరమాయువు.

# ఉత్తరాభాద్ర

రెండు నక్షత్రాలు దండాకృతిలో వుండేదే ఉత్తరాభాద్రా నక్షత్రం. కృష్ణవర్ణం, పురుషతార, చంద్ర నక్షత్రం, మనుష్య గణం, గో (ఆవు) యోని, క్షత్రియ జాతి, చతుష్పాత్తు, సులోచనం, ణకారాక్షర స్వరం, సమతార, గ్రామస్థానం, వాయు మండలం, అధిపక్షి గుడ్లగూబ, అధివృక్షం పిచుమందం, అధిదైవం బహిర్బుధ్న్యుడు.

ఋక్షాది చతుర్వింశతి ఘటికాత్పరం విషనాడి.

యాత్రలకీ తార శుభప్రదం. ముఖ్యంగా—తూర్పు, ఉత్తర దిశలకు ప్రయాణమయ్యేందుకు శ్రేష్ఠమైనది.

ఈ నక్షత్రంలో కలిగే జ్వరాదులవలన అయిదు రోజులు అరిష్టం. తచ్ఛాంతికి-

శ్వేతవర్ణం కలిగి, పరశు పద్మాభయాలు ధరించిన చతుర్భుజ యుక్తంగా-అహిర్బుధ్న్యుడి స్వర్ణ విగ్రహం చేయించి-"విష్ణుర్యోనిం కల్పయ"అనే మంత్ర విధితో షోడశోపచారాలా పూజించాలి. ఆ పూజలో బర్బర గంధం, శతపత్రపుష్పం, నేతితోకూడిన గుగ్గుల ధూపంతప్పనిసరిగా

వుపయోగించాలి. బెల్లపుటన్నం నివేదించాలి, అనంతరం గాయత్ర్యాష్టోత్తరశతంతో పాలూ సమిధలూ కలిపి హోమం చేయాలి. తుదిగా గంధమాల్యాలు బెల్లపుటన్నంతో సహా తూర్పుదిక్కున బలిచేయాలి. దానివలన అరిష్టాలు తొలగి-అయిదు రోజులలో సుఖసౌఖ్యాలు సిద్ధిస్తాయి.

## తిదివార యోగదీన్

ఉత్తరాభాద్ర ఆదివారం-సిద్ధయోగం
సోమవారం—శుభయోగం
మంగళవారం-మృత్యుయోగం
బుధవారం-అమృతసిద్ధియోగం
గురువారం—శుభయోగం
శుక్రవారం-వరయోగం
శనివారం-నాశనయోగం

భద్ర తిథులలో నిర్జీవయోగం

హస్తా నక్షత్రం క్రూరగ్రహయుతమైతే మహాశూలయోగం.

ఈ నక్షత్రంలో ఉత్పాత దర్శనంవలన-పంటలు అభివృద్ధి.

## ప్రథమ రజస్వలా ఫలం

ఉత్తరాభాద్రలో ప్రథమ రజస్వలయైన పడుచు పుత్ర సంతానవతి అవుతుంది.

## ఇతరాన్

ఋతు పుంసవనసీమంత నామకరణాన్న ప్రాశన చౌలో పనయన వివాహ యాత్రలకీ, వైద్యారంభానికీ, గుఱ్ఱాలు—ఏనుగులు-రథాలు-పల్లకీలు-క్రొత్త వాహనాలూ అధిరోహించేందుకు, సింహాసనాధిపత్యానికీ, మంత్రానుష్ఠానానికీ, అన్ని రకాల దైవతోపాసనలకీ, అన్ని రకాల మొక్కలు నాటడానికీ, గృహారంభానికీ, గోపురాలెత్తడానికీ, ఈ తార సర్వోత్తమమైనది.

## జాతక గుణగణాదీన్

ఉత్తరాభాద్రా నక్షత్ర జాతకులు - అభివృద్ధిలోకి రాగలవాళ్ళు, ధైర్యవంతులూ, నీతిమంతులూ- చంచల స్వభావులు, రోగులూ,బద్ధకించే వాళ్ళూగా వుంటారు.ఎడమ భాగంలో తిలక మత్స్యాంకాలు వుంటాయి.

## పాదాంశాది

ఈ తార తొలిపాదం- రవిది-తీక్షణాంశ —ఈ వేళా

సంజాతులు పైత్యశరీరులూ, చపల చిత్తం కలవాళ్ళూ, కోపిష్ఠులు, ఎర్రటి నేత్రాలు కలవాళ్ళూ, కృశించిన శరీరం కలవాళ్ళుగా వుంటారు.

ద్వితీయపాదం బుధుడిది - అభయాంశ - ఈ జాతకులు దైవజ్ఞులు (జోతిశ్శాస్త్ర పండితులు-లేదా -పంచాగకర్తలు) జ్ఞానులూ, సౌమ్యమైన గుణం కలవాళ్ళూ, అవతలివారిలోని గుణాల్ని గ్రహించగలవాళ్ళు అవుతారు.

తృతీయపాదం కుజుడిది - ఉగ్రాంశ - రక్త వ్యాధి మాలిన్యం- కోపం, ఔదార్యం వీళ్ళ లక్షణాలు.

వీళ్ళ జీవనం పందొమ్మిది సంవత్సరాల వ్యవధిగల శని మహాదశతో ప్రారంభమవుతుంది. తదుపరి బుధదశ అది పదిహేడు సంవత్సరాలు.

ఈ ఉత్తరాభాద్రా నక్షత్రజాతకులకి జననాది ఆరు మాసాలలో అపమృత్యుభయం కలుగుతుంది. గడిస్తే పదకొండవయేట జ్వరభయం, అధిగమిస్తే పద్ధెనిమిదవ ఏట మృత్యుభయం కలుగుతుంది, వృషభ (వైశాఖ - జ్యేష్ట) మాసంలో ఆదివారం, బహుళ చతుర్థశితిధిఉత్తరాభాద్రా నక్షత్రయుక్తమైతే - సూర్యోదయాది నాలుగు ఘటికలలో అపమృత్యువు సిద్ధిస్తుంది. అది తప్పితే 90 సంవత్సరాలు పరమాయువు.

ఈ తారలో జన్మించకపోయినా-దు-శం-చా-ధా-అనే నాలుగింటిలో ఏ అక్షరంతోనయినా ప్రారంభమయిన పేరు కలవాళ్ళందరికీ ఈ నక్షత్రప్రభావం వర్తిస్తుంది.

# రేవతి

గుహ్యాజననీ, గుణవతీ ! ముప్పైరెండు తారలు ముచ్చటగొలిపే మత్స్యాకృతిలోవుండే నక్షత్రమే రేవతి. ఇది స్త్రీ లింగతార, చంద్రనక్షత్రం, దేవగణం, గజయోని, శూద్ర జాతి, చతుష్పాత్తు, తిర్యఙ్ముఖం, మృదుతార, అకారాక్షర స్వరం, విషమతార, వరుణ మండలం, అధిపక్షి నెమలి, అధివృక్షం మధూకం, అధిదైవం-పూషా నామ సూర్యుడు.

ఈ నక్షత్రం త్రింశద్ఘటికాపరం విషనాడి.

అన్ని దిక్కుల ప్రయాణాలకీ శుభనక్షత్రం.

ఈ తారలో జ్వరాది వ్యాధిగ్రస్తత వలన ఇరవై రోజులపాటు అరిష్టం. తచ్ఛాంత్యర్థం - పద్మాసనస్థుడయిన పూషానామక సూర్యదైవవిగ్రహాన్ని బంగారంతో చెక్కించాలి. రెండుచేతులూ, ఒక చేతిలో పద్మపుష్పం, మరో చేతిలో అభయముద్ర ధరించి వుండాలి. ఆ ప్రతిమను-రక్త (ఎర్రని) వస్త్ర, రక్త గంధాలతోనూ, అర్క (జిల్లేడు) పువ్వులతోనూ గుగ్గులధూపంతోనూ పూజించాలి. "హగ్ం నశ్శుచిషత్" అనే మంత్రయుక్తంగా షోడశోపచారాలూ

గావించాలి, నువ్వుల అన్నం నివేదించాలి. పూజానంతరం తరగబడని ఫలాలతోనూ - జువ్వి, మేడి యిత్యాది హోమ సమిధలతోనూ, నేతితోనూ - గాయత్ర్యాష్టోత్తర శత యుతంగా హోమం చేయాలి. తుదగా—గంధమాల్యాదిగా నువ్వులతో కూడిన అన్నాన్ని ఉత్తర దిశలో బలిచేయాలి. ఈ విధినిర్వహణ ద్వారా అరిష్టం తొలగి ఇరవై రోజులలో సుఖసౌఖ్యాలు ఇబ్బడిముబ్బడిగా పొందుతారు.

## తిథివార యోగాదీన్

రేవతీ ఆదివారం-స్థిరయోగం

సోమవారం-మృత్యుయోగం

మంగళవారం-యమకంటకయోగం-నందాతిథిఅయితే కరణ యోగం,

బుధవారం-యమద్రంష్టాయోగం

గురువారం—నాశనయోగం

శుక్రవారం-నాశనయోగం-ఏకాదశీ తిథిఅయితే విష యోగం.

శనివారం- ఉగ్రయోగం-అష్టమీ తిథిఅయితే విష యోగం.

తక్కిన వారాలలో పంచా తిథులతో నిర్జీవయోగం.

కన్యా (భాద్రపద-ఆశ్వియుజ)మాసం శూన్యయోగం

ఉత్తరాషాఢానక్షత్రంక్రూరగ్రహాయుతమైతే మహా శూలయోగం

ఈ నక్షత్రంలోఉత్పాతదర్శనాలవలన-అగ్నిభయం, యుద్ధభయం కలుగుతాయి.

ఎరుపురంగు మేఘ దర్శనం వలన వర్ష సూచన-

ఈ నక్షత్రంలో రవి సంక్రమణవలన — మధ్యతరహా ధరలు.

## ప్రథమ రజస్వాలా ఫలం

రేవతీ తారలో ప్రథమ రజస్వలయైన కన్య-పతివ్రత పుత్రసంతానవతీ అవుతుంది.

## ఇతరాన్

ఋతు పుంసవన నామకరణాన్నప్రాశనోపనయన శాస్త్రాభ్యాసాక్షరాభ్యాసతైలాభ్యంగనాదులకీసమావర్తన వివాహ రాజ్యాభిషేకాలకీ సింహాసనం యెక్కడానికీ(పదవీ స్వీకారానికి) గజతురగరథారోహణలకీ, నూతన వాహనాల నుపయోగించడంప్రారంభించడానికీ, వివిధ విద్యాభ్యాసాలకీ, వైద్యచికిత్సారంభానికీ, గాత్రసంగీత సాధనకీ, విద్యాభ్యాసా

నికి, నాట్యాభ్యాసానికీ, శంకుస్థాపనలకీ, సర్వదేవతా ప్రతిష్ఠాపనలకీ, అమ్మకాలూ-కొనుగోళ్ళూ చేయడానికీ ప్రయాణాలకీ వ్యవసాయారంభానికీ, అన్ని రకాల విత్తనాలనీ చల్లడానికీ పాతుదలకీ కూడా ఈ నక్షత్రం ప్రశస్తమైంది.

## జాతక గుణగణాన్

రేవతీ తారలో జన్మించినవాళ్ళు - స్థూలకాయులు, సౌభాగ్యవంతులు, చక్కటి రూపసౌందర్యం కలవాళ్లూ, భోగులూ, యాచకులకు ప్రియం చేసేవాళ్లూ, పండితులు, అన్నదాతలు- ఇతరుల కార్యాలు నేరవేర్చడంలో లగ్నమయి వుండేవాళ్ళూ, పరదేశవాసులు, శరీరంలో స్వల్పమైన మత్స్యాంకతిలకాదులున్న వాళ్ళుగా వుంటారు. వీళ్ళ తేజస్సు పరులకి భయం కలిగిస్తుంది. ఇంత ఉత్తమ లక్షణాన్వితు లయినా కూడా - ఈ జాతకులు ఎడతెగని చింతలో మునిగి వుంటారు.

## పాదాంశాది

రేవతీ ప్రథమ పాదం - గురువుది-ఉత్పన్నాంశ- ఈ వేళా సంజాతులు శాస్త్రార్థవేత్తలు, తాత్వికులు నీతిమంతులూ అవుతారు.

ద్వితీయ పాదం శనిది - పాపాంశ - పాపకర్మలు చేసేవారూ, జూదగాళ్ళూ, కుటిల బుద్ధులతో వుంటారు.

తృతీయపాదం కూడా శనిదే, కాని, అంశ- ఉగ్రాంశ

కావడంవలన సౌందర్యవంతులయినప్పటికీ, మందబుద్ధులూ క్రోపిష్ఠులూ అవుతారు.

చతుర్థ పాదం గురుడిది. శోభనాంశ - ఈ జాతకులు యజ్ఞయాగాదుల్నీ, దైవీయకార్యాల్నీ చేస్తూంటారు. పండితులూ, వేదాంతులు, ధైర్యవంతులూ అవుతారు. అయితే ఈ నాలుగో పాదం చివర రెండు ఘడియల కాలం అభుక్తదోషం.

ఈ తారాజాతుల జీవనం - పదిహేడు సంవత్సరాల గడువు కలిగిన బుధమహాదశతో ప్రారంభమవుతుంది. తరు వరి కేతుదశ. అది ఏడు సంవత్సరాలు.

రేవతీనక్షత్రంలో జన్మించినవాళ్ళు జననాది అయిదవ రోజున వాతరోగభయం, అయిదవ నెలలో మాంద్య జ్వరపీడ పదిహేనో నెలలో రోగపీడ, అయిదవ ఏట వాతజ్వరం, పన్నెండో ఏట నాలుగు కాళ్ళ జంతువుల వల్ల హాని, నలభ య్యవ ఏట అపమృత్యువు, అరవయ్యవ ఏట మహాకంటకం.

కృష్ణపక్ష ద్వాదశీ తిథి, ఆదివారం, రేవతీ నక్షత్రం కూడి వుంటే సూర్యోదయాది తొమ్మిదవ ఘడియలో జ్వరరూపంగా అపమృత్యువు కలుగుతుంది. దానికి అతిక్ర మించితే ఎనభై నాలుగు సంవత్సరాలు పరమాయువు.

ఇదే తారలో జన్మించకపోయినా— దే-దో-చా-చీ-అనే నాల్గింటిలో ఏదో ఒక అక్షరంతో ప్రారంభమయ్యే పేర్లు గలవాళ్ళందరికీ ఈ నక్షత్ర ప్రభావం వర్తిస్తుంది.

# తారలు

# వృత్తి-ఉద్యోగ కారకత్వములు

## 1. అశ్విని

ఓం ప్రథమ నక్షత్రమైన యీ తార సమస్తమైన వృత్తి వుద్యోగాలకీ, వ్యాపారాదులకీ కారకత్వం వహిస్తుంది. కాగా-జాతకులకు జన్మలగ్నరీత్యా యేర్పడే చురుకుదనం, మందకొండితనాలమీద-దీని కారకత్వం ఆధారపడి వుంటుంది.

## 2. భరణి

మహోజ్వలమైన యీ నక్షత్రం సరియైన పంథాలో యోగిస్తే రాజరికానికి కారకత్వం వహిస్తుంది. "భరణిని పుట్టినవాళ్ళు ధరణినేలుతారు" అనేది జగత్ప్రసిద్ధమైన విషయం. కాగా- యోగభాగలలో తేడాలున్నట్లయితే మాత్రం- తామెంచుకున్న రంగంలో అగ్రస్థానాన్ని కలిగించేందుకు ఈ తార కారకత్వంవహిస్తుంది. మిలటరీ, పోలీస్, ప్లీడరీ వంటి-శాక్తేయ, తార్కిక, సాహసమయ వృత్తి ఉద్యోగాదులకు దీని కారక్వతం యెక్కువగా వుంటుంది. వర్తమానకాలంలో ఉపాధ్యాయవృత్తి - బ్యాంకు ఉద్యోగాలకుకూడా ఈ తార కారకత్వం అనుభవనీయమవుతోంది.

## 3. కృత్తిక

లలితకళాప్రవేశం, కవిత్వరచన, శిల్పచిత్రలేఖనస్పర్శ, పశువైద్యం, అగ్నిమాపకదళంలో కొలువు, జర్న

లిజం, టైపిస్టు ఉద్యోగం, ఇంకా-వ్యవసాయ రెవిన్యూ శాఖలలో తగుపాటిహోదాగల ఉద్యోగాలకూ-కారకత్వం వహిస్తుంది. స్త్రీదేవతా ఉపాసనలకీ-జ్యోతిషపరిచయం, ఆ శాస్త్రంమీదనే ఆధారపడి జీవించడం వంటి వాటికికూడా కారకత్వాన్ని భరిస్తుంది.

## 4. రోహిణి

దైవీయమైన పరిశుద్ధతార యిది. నిజానికి యువరాజత్వానికి కారకత్వం వహిస్తుంది. ఉన్నతోద్యోగులు అనర్గళంగా వున్నప్పుడు- సర్వసమర్థంగా, సర్వాధికారాలతోనూ అన్ని పనులు నెరవేర్చే ఉద్యోగస్థులకి ఈ నక్షత్రం కారకత్వం వహిస్తుంది. ఒక్క-ముక్కలో చెప్పాలంటే- మకుటంలేని మహారాజుల్ని చేస్తుందీ నక్షత్రం. వృత్తి, వ్యాపార, ఉద్యోగరంగాలు యేవైనాసరే- మొదలుపెట్టడం ఆలస్యం-తుదకంటూ తీసుకువెళ్ళే కారకత్వం ఈ తారకి వుంది.

## 5. మృగశిర

కొంచెం తక్కువ తరహా వృత్తివ్యాపారోద్యోగాలకి కారకత్వం వహిస్తుంది. దీని కారకత్వం వల్ల యెవరికీ తృప్తి వుండదు. కాగా-ఇది పూర్ణబలంతో వుండగా పుట్టిన జాతకులకి మాత్రం సర్వసిద్ధులనీ అనుగ్రహిస్తుంది. అలాటి జాతకులు నూటికి ఒక్కరు ఉండడం కూడా గొప్పే.

## 6. ఆరుద్ర

పాండిత్య కారకత్వం. సాధారణంగా వ్యాపారస్థులవుతారు లేదా స్వతంత్ర వృత్తులవాళ్ళవుతారు. ఒకవేళ ఉద్యోగాలు చేయాల్సివచ్చినా నాలుగంకెలకి తగ్గని జీతగాళ్లే అవుతారు. రైల్వేలో సిగ్నలర్స్ అయ్యే అవకాశం వుంది. ఈ నక్షత్రం అవయోగం పట్టినట్లయితే-ఆ కారకత్వం వల్ల అల్పమైన జీతాలకి పనిచేసే అవస్థను కూడా కల్పిస్తుంది.

## 7. పునర్వసు

ఉత్కృష్టమైన కష్ట జీవితానికీ, తద్వారా అఖండమైన కీర్తి ప్రతిష్టలకీ, నిరంతర ధర్మాచరణకీ ప్రధాన కారకత్వం వహించే యీ తార-బాల్యంలో విద్యకీ, యౌవనంలో కొంతభాగం భోగించి-ప్రౌఢత్వం (40-45సం॥లు) సిద్ధించేవరకూ కష్టభూయిష్ఠంగా వుంటుంది. ధర్మం తప్పనంతవరకూ-సమస్తమైన వృత్తి-ఉద్యోగ-వ్యాపారాలందునా అభివృద్ధికీ, అఖండకీర్తికీ కారకత్వం వహిస్తుంది.

## 8. పుష్యమి

జాయింటు వ్యాపారాలకి కారకత్వం వహిస్తుంది. వైద్య వృత్తిలోగాని, ఆరోగ్యశాఖలోగాని చేరుస్తుంది. ఇంజనీరింగు, జలసంబంధకార్యాలూ, బియ్యం-నల్లమందు వ్యాపారాలూ చేయిస్తుంది. ఇల్లరికం పంపిస్తుంది. విదేశా

లకీ పంపిస్తుంది. ప్రభుత్వోద్యోగమైతే టెలిఫోన్ ఆపరేటర్ గా అధిక కారకత్వం వహిస్తుంది. లేదా-వీణావాదన వల్ల ఖ్యాతి సాగింపచేస్తుంది. యోగదశలో వుంటే-ప్లీడర్ని చేస్తుంది. జమీందారుని చేస్తుంది మహారాజయోగంలో జీవితాన్ని నడిపిస్తుంది.

## 9. ఆశ్రేష

ఏ మాత్రం యోగం పట్టినా-యీ ఆశ్రేష-స్వతంత్ర వృత్తులకీ-వ్యాపారాలకీ మాత్రమే కారకత్వం వహిస్తుంది. ముఖ్యంగా బట్టల వ్యాపారం, కమిషన్ వ్యాపారం, హోటల్ వ్యాపారం, బ్యాంకర్, లాయర్, డాక్టర్- ఈ తరహాలో వుంటుంది. సాధారణ తారగా వుంటే పోస్టు మాస్టర్లు, పోలీస్ఇన్స్పెక్టర్లు, సబ్ డివిజనల్ ఆఫీసర్లూగా చేస్తుంది, వక్రించిన ఆశ్రేష ఏ గుమాస్తా ఉద్యోగంలోనో వుంచుతుంది. యోగాన్ని అనుసరించి- జాతకులు- జమీందార్లూ, కోటీశ్వర్లూ అయినా ఆశ్చర్యపోనక్కరలేదు.

## 10. మఖ

ఈ తార వ్యాయామ శిక్షకులకు కారకత్వం వహిస్తుంది. అంటే-డ్రిల్లుమాస్టర్లకు కూడా. ఒక్కొక్క సారి సాధారణ ఉపాధ్యాయ పదవులకుకూడా కారకత్వం పడుతుంది. ముఖ్యంగా-కరెంటుపని, మెకానిజం, ఇంజనీరింగ్, ముద్రణాలయం, తాణేదారులకుకూడా కారకత్వం ఈ తారదే

ఇంకా, వుగాకువ్యాపారం, పోలీసు వుద్యోగం, జ్యోతిష వృత్తి, రంగస్థల (నాటక) సంస్కర్త- వీటికికూడా మఖ తారే కారకత్వంగా చెప్పబడుతోంది.

## 11. పూర్వాఫల్గుణి [పుబ్బ]

భూస్వాములునో, రాజుల్ని చేస్తుంది, వ్యాపార స్థుల్ని, రచయితల్ని, ముఖ్యంగా వేదాంత గ్రంథ రచయితల్ని సృష్టిస్తుంది. రిజిస్ట్రార్లుగానో, సబ్ కలెక్టర్లుగానో చేస్తుంది- అవయోగంలో వుంటే పోస్టు గుమాస్తాగానో, ఫ్యాన్సీ షాపుల్లోనో - ఇతర వ్యాపార సంస్థల్లోనో గుమాస్తా గిరికీ, జ్యోతిషం చెప్పుకోవడానికీ, ఉపాధ్యాయ వృత్తికీ మరలిస్తుంది. చేస్తే డాక్టర్ని చేస్తుంది. లేదా కాంపౌండర్ని చేసి కూర్చోబెడుతుంది.

## 12. ఉత్తర

పద్దులు వ్రాసే ఉద్యోగానికీ, కౌటిల్యం ప్రదర్శించాల్సిన ఉద్యోగాలకీ మోసంతోకూడిన వ్యాపారాలకీ, నిజాయితీలేని ఉద్యోగాలకీ, కమీషను వృత్తులకీ ఈ తారకారకత్వం వహిస్తుంది.

## 13. హస్త

గ్రామ మునసబు, పంట పొలాలపై అజమాయిషీ స్టెనోగ్రాఫర్, జర్నలిస్ట్, పాండిత్యం, తానీధారు, మేజిస్ట్రేట్ వంటి ఉద్యోగాలకు కారకత్వం వహిస్తుంది.

వ్యాపారాలలో పాత యినుము వ్యాపారం, లేదా-

చిన్న తరహా హోటల్, బియ్యం దుకాణం, కిళ్ళీకొట్టు, కార్ఖానా - నడిపేందుకు కారకత్వం భరిస్తుంది. విశేష యోగం పడితే మాత్రం నెయ్యి, పంచదార వంటి రస ద్రవ్యాల ఎగుమతి వ్యాపారులుగా మారుస్తుంది.

## 14. చిత్త

దాత్యం, దగా - మొదలయినవాటికి కారకత్వం వహిస్తుంది. పట్టినది బంగారం చెయ్యడానికి కూడా ఇదే కారకత్వం వహిస్తుంది. సరైన యోగవేళలో - జన్మించిన జాతకులకు ఇది అన్ని వ్యాపారా వ్యవహారాలలో విజయా న్నిస్తుంది. ఉద్యోగస్తులే అయినా - పైవారికన్నా ముందు గా స్మరించుకోవలసిన వ్యక్తులుగా అయ్యేందుకు ఈ తార సర్వత్రా కారకత్వాన్ని వహిస్తుంది.

## 15. స్వాతి

సంగీత సభలలోనూ అక్కడ పనిచేసే ఉద్యోగం లగాయుతు - జిల్లా జడ్జి ఉద్యోగం వరకూ కారకత్వం వహించే తార స్వాతి. రాజులూ జమీందారులూ, ఎగు మతి, దిగుమతి వ్యాపారస్థులూ, నటులూ, కవులూ, పాత్రి కేయులూ - ఒకరేమిటి - ఈ స్వాతీతార కారకాత్వం వహించని వృత్తి ఉద్యోగ వ్యాపారాలంటూ యేమీ లేవు.

## 16. విశాఖ

భాషా ఉద్యోగం, ఉపాధ్యాయ వృత్తి, వ్యవసాయం పాల వ్యాపారం, వాచీలూ వగయిరాల రిపేరింగు, ప్లీడరు

గుమాస్తాపని, చిన్న బ్రోకర్‌గా మొదలై పెద్ద వ్యాపారం లోకి వెళ్ళడానికీ ఇది కారకత్వం వూనుతుంది. ముఖ్యంగా తరచూ బదిలీలయ్యే ఉద్యోగాలకి కారకత్వం వహించడం ఈ విశాఖ ప్రత్యేకతగా చెబుతారు.

## 17. అనూరాధ

వ్యాపార కారకత్వం యెక్కువ. బియ్యం, అపరాలు పుస్తకాలు, బంగారం, కొబ్బరి, ఫాన్సీ - ఇలా ఏ వ్యాపారానికైనా సరే కారకత్వం వహిస్తుంది. ఉద్యోగాల రీత్యా డ్రైవర్ ఉద్యోగానికి, ఉపాధ్యాయ వృత్తికీ, పోస్టల్‌లోనూ కారకత్వం వహిస్తుంది. సాధారణోద్యాగాలు సరేసరి. ఈ తార - జీవితయానంలో కొన్నాళ్ళపాటు - జాతకుల్ని సన్యాసులుగా మార్చేసే కారకత్వాన్ని కూడా వహిస్తుంది.

## 18. జ్యేష్ఠ

సినిమారంగ జీవనం, స్వతంత్ర జీవనం, వ్యవసాయం, నూలుకు సంబంధించిన ఏజెంటుగా వుండడం, ధాన్యం అపరాలూ వ్యాపారం, ఉప్పు సంబంధం, జ్యోతిష్యం, జిల్లాలో చెప్పుకోదగిన ఉద్యోగం, బ్యాంకరుపని, సబ్ ఇన స్పెక్టరు, స్టేషన్ మాస్టరు - వగయిరాలకు ఈ తార కారకత్వం వుంటుంది. ముఖ్యంగా ఏ పనీ లేకుండా కొంతకాలం వృథాగా కాలయాపన చెయ్యడానికి కూడా ఈ జ్యేష్టా నక్షత్రమే కారకత్వం వహిస్తుంది.

## 19. మూల

సాధారణంగా - రెవెన్యూ శాఖా ఉద్యోగాలు, గ్రామ మునసబు గిరీ, ప్లీడర్ గుమాస్తా, శిరస్త్రదారు, సంస్కర్త, రచయిత, పౌరోహిత్యం, టైపిస్టు - పనులకు దీని కారకత్వం వుంటుంది. యోగం పట్టినప్పుడు ఇంజనీరులకీ, విద్యా శాఖాధికారులకీ, డాక్టర్లుకీ కారకత్వం వహిస్తుంది. సోడాబుడ్లు, ఇనుము, వడ్డీ వ్యాపారాలని చేయిస్తుంది. లాయర్లను చేస్తుంది.

## 20. పూర్వాషాఢ

సంప్రదాయం ప్రకారం ఏ వర్ణంవారు ఆ పనులు చేసుకుంటారు, ఆధునికధోరణుల రీత్యా ఫారెస్టు ఆఫీసర్లు, సానిటరీ ఆఫీసర్లు, సబ్ కలెక్టర్లు, కోశాధికారులూ, పోస్టల్ ఉద్యోగులు, కోర్టు ఉద్యోగులు, ధనవంతుల దగ్గర చాకిరీ, రైల్వే ఉద్యోగాలూ – వీటికి ఈ తారే కారకత్వం వహిస్తోంది. ఈ తారలో పుట్టినవారూ జ్యోతిష్యం నేర్చుకుంటే ప్రసిద్ధులవుతారని, ప్రసిద్ధ జ్యోతిష్యవేత్తలు చెబుతున్నారు ఏ చిన్న వ్యాపారం పెట్టుకున్నా కూడా ఈ తార కారకత్వం వహించి - వాళ్ళని నిలబెడుతుంది. మీదు మిక్కిలి వకీలు వృత్తికిది మంచి తారగా ఇటీవలి వారు చెబుతున్నారు.

## 21. ఉత్తరాషాఢ

అత్యుత్తమమైనదీ, "మిస్టర్ క్లీన్"గా శ్లాఘించబడేదీ అయిన ఈ నక్షత్రం పత్రికలు స్థాపించడానికీ - నడపడానికీ - పత్రికలలో పని చేయడానికీ, రెవెన్యూ ఉద్యోగాలకీ, ప్లీడర్ గుమాస్తా లగాయితు - న్యాయాధికారి వరకూ గల చట్ట సంబంధిత ఉద్యోగాలకి, పోలీస్ ఉద్యోగాలకీ; ఒక్కొక్కసారి - మార్పిడి వ్యవహారాలు సాగే చోట "జీ. వో." లకి, లేని చోట్ల సాధారణ "ఎన్. జీ వో." లకీ - కారకత్వం వహిస్తోంది. స్వతంత్ర వృత్తులలో లాయరు, వైద్యుడు, వ్యవసాయదారుడు కావచ్చు. సినీ రంగ జీవితానికీ, కవులకీ, నటులకీ అందరికీ ఈ నక్షత్రానిదే కారకత్వం. రైల్వే స్టేషన్ మాస్టర్లకీ, టిక్కెట్ ఎగ్జామినర్లకి కూడా ఈ తార కారకత్వం వుంటుంది. అత్యంత క్రమశిక్షణాబద్ధమైన ఆర్మీ పనులకి కూడా దీని కారకత్వం వుంది. ఇక వ్యాపారాలలో - బియ్యం, తెలివితేటలు, ధర్మ సందేహాలు; కబుర్లు —దీనిదే కారకత్వంగా గ్రహించాలి.

## 22. శ్రవణం

కవులూ, ఉపాధ్యాయులూ, జ్యోతిషులూ, వ్యవసాయదారులకి దీని కారకత్వం వుంటుంది. కంట్రాక్టర్లకి, రెవెన్యూ ఉద్యోగులకి, కొబ్బరి - జాయింటు - అద్దం

వ్యాపారస్థులకి కూడా ఈ తారా కారకత్వంతో తోడ్ప డుతూ వుంటుంది.

## 23. ధనిష్ఠ

తెలుగు పండితులకీ, కాలేజీ ప్రిన్సిపాల్స్‌కీ, టైపిస్టులకీ సాధారణగుమాస్తాలకీ, బ్రాంచీ పోస్టాఫీసులలోపనిచేసేవాళ్ళ కీ, కాంపౌండర్లకీ-ఇది కారకత్వం వహిస్తోంది. అంతేకాదు- గొప్ప సంగీతవిద్వత్తుకీ, కొబ్బరి — కలప - జాయింటు — బ్యాంకింగ్ వ్యాపారాలకీ కూడా ఈ తారదే కారకత్వం గా చెప్పబడుతోంది.

## 24. శతభిషం

ప్లీడరు గుమాస్తాలూ, బ్యాంక్ గుమాస్తాలూ, ఇంకా అనేక రకాల గుమాస్తా ఉద్యోగాలకి ఇది కారకత్వం వహిస్తుంది. తమలో లేని నైపుణ్యాలన్నీ వున్నట్లుగా పేరు పొందడానికీ - లేనిపోని గొప్పలు చెప్పుకుంటూ బ్రతకడా నికీ దోహదం చేస్తుంది. దీని సంపూర్ణయోగబలంలో జన్మిం చిన జాతకులు-నాకు యింతవరకూ యెక్కడా కనబడలేదు.

## 25. పూర్వాభాద్ర

బ్యాంకింగ్, వడ్డీ, నూనెవ్యాపారాలకీ — ప్లీడరీకీ - వ్యవసాయానికీ - దీని కారకత్వం వుంటుంది. దస్తావేజులు

వ్రాయడం, ప్లీడరుగుమాస్తాగా వుండడం, సాధారణ గుమ
స్తాగిరీ, టైపిస్టుపని - వీటికికూడా - ఈ తారా కారకత్వం
వుంటుంది. అలాగే ఈ తార - హైకోర్టు జడ్జీ పదవికికూడా
కారకతవహిస్తోంది. ఈ నక్షత్రం 4వ పాదంలో జన్మించిన
వాళ్ళకి దేవాలయ అర్చన కారకత్వం కూడా ఈ తారదే
నని చెబుతారు.

## 26. ఉత్తరాభాద్ర

యోగిస్తే పాండితీ ప్రకాండత - యోగించకపోతే పాచి
పనులు చేయడం వగయిరాలకు కారకత్వం వహించే తార
యిది. అధికభాగం "మేస్త్రీ" పనులకు కారకత్వం వహి
స్తుంది. ఉద్యోగమైనా, ఊడిగమైనా, వృత్తయినా, వ్యాపా
రమయినా - అంతవరకే దీని కారకత్వం. ధర్మాన్ని తప్పితే
మాత్రం — హీనస్థానం తప్పదు.

## 27. రేవతి

నక్షత్రాలలో కడపటిదైన యీ తార సర్వోత్తమ
కారకత్వాన్ని కలిగి వుంది. మొదటి తార అశ్వినికిమల్లేనే-
ఏ రంగంలో అడుగుబెడితే-ఆ రంగంలో అభివృద్ధికి కారం
కత్వం వహిస్తుంది.

# తారలు
# వ్యాధి కారకత్వములు

## 1. అశ్విని

ఆరోగ్యవంతమైన తార. సాధారణంగా వ్యాధులని కలిగించదు. అవయోగజాతులకి మాత్రం - అగ్నిమాంద్యం, అస్త్ర - శస్త్రఘాతాలు, అగ్నిపీడ - వంటివి కలిగేందుకు కారకత్వం వహిస్తుంది.

## 2. భరణి

అత్యంత బలవత్తరమైన తార. అన్నివ్యాధుల్నీ అగ్నిలా - యముడిలా దహించివేసే యీ తార - ఏ వ్యాధులకీ కారకత్వంలేనిదిగా కొందరు చెబుతున్నారు. కాని, "రక్తదోషం" అనే దానికి మాత్రం దీనిదే కారకత్వమని పెద్దల వాక్యం.

## 3. కృత్తిక

1-3 పాదాలు బలహీనతకీ - నరాల బలహీనతకి కారకాలు. వీళ్ళకి ఏ వ్యాధి వచ్చినా ఆశ్చర్యపోవలసిన పని లేదు. తారా కారకత్వం తక్కువ - తమ అజాగ్రత్తలు యెక్కువా కావడం వల్లనే వీళ్ళు వ్యాధిగ్రస్తులవుతారు. సాధారణంగా — ఉష్ణ, శీతల జ్వరాలొస్తాయి. ఒక్కొక్క సారి స్ఫోటకం - విషకీటకస్పర్శ — వాతజ్వరం — ఆయుధ ఘాతాలకీ కూడా కారకత్వం వహిస్తుంది.

## 4. రోహిణి

ఆరోగ్యతార. నిర్లక్ష్యమనే వ్యాధికి కారకత్వం వహిస్తుంది.

## 5. మృగశిర

తరచుగాయాలూ, నీరసం, పడిపోవడాలు, అన్నిటికీ ఇదే కారకత్వం వహిస్తుంది.

## 6. ఆరుద్ర

పైత్య-ఉష్ణ సంబంధ వ్యాధులు మెండుగావుంటాయి హిస్టీరియా, మూర్ఛ, చెవుడు, రక్తహీనత, ఉదరమేహం, ఆనికాయలు, మతిభ్రమణం, శరీరంమీద కాయలు (సురు గుళ్ళవంటివి) లేవడం తుదకు క్యాన్సర్ వ్యాధికికూడా ఈ తార కారకత్వం వుంటుంది.

## 7. పునర్వసు

మానసిక చింతలకి కారకత్వమవుతుంది.

## 8. పుష్యమి

ఇది వాత సంబంధరోగాలకు కారకత్వం వహిస్తుంది శరీరాన్ని ఎండగడుతుంది. రక్తదోషాలనీ-గక్త క్షయనీ కల్పిస్తుంది. అజీర్తి, ఎక్కిళ్ళు మొదలయిన వ్యాధులకి కారకత్వం భరిస్తుంది. ఉబ్బుకామెర్లు, గుండెనీరసం, గుండె జబ్బు, ఊపిరితిత్తులకి సంబంధించిన వ్యాధులూ, తలత్రి ప్పుడు, కఫ-శిరోవాతాలూ, మూత్రంలో రాళ్ళు పడడం వంటి దీర్ఘవ్యాధుల్ని కూడా కల్పిస్తుంది. జాతకులు జాగ్ర త్తగా వుండవలెను.

## 9. ఆశ్లేష

ఆమ్లవాతం, అతిరక్తం, పక్షవాతం, నేత్రవ్యాధులకు కారకత్వం వహిస్తుంది. శ్వాసకోశవ్యాధులు కూడా కలిగించగలదు. అన్నద్వేషం, ఆకలి కలగకపోవడం, వరిబీజం, పిచ్చి, పయోరియా, మదోన్మాదం, హిస్టీరియా, పిప్పిగోళ్ళు, పళ్ళవ్యాధులు, ఒంటిమీద కంతులు-ఇంకా అనేకరకాలైన సుఖవ్యాధులుకూడా కలిగిస్తుంది.

## 10. మఖ

తలనొప్పులు, గర్భస్రావాలూ, రక్తప్రదరదంత వేష్టాలూ, రాచవ్రణాలూ, సర్వాంగవాతం, ధనుర్వాతం, ధనుస్తంభం, పక్షవాతం, శిరశ్శూలు, ప్రమేహపీడిక, వాతరక్త-క్యాన్సర్ వంటి-అనేకరోగాలకీ ఈ తారయే కారకత్వం పూనుతోంది. జాతకులు నిత్యం జాగ్రత్తగా వుండవలెను.

## 11. పూర్వ ఫల్గుణి

సంతత- సన్నిపాత-అతిసార- విషజ్వరాలకీ, గ్రహణి, అజీర్తి, మశూచి, అంత్రవృద్ధి, పాకూ, మూత్రకృచ్ఛ్ర, ధనుస్తంభాది వ్యాధులకీ కారకత్వం వహిస్తుంది.

## 12. ఉత్తర ఫల్గుణి

సుఖవ్యాధులూ, వరిబీజం, మూత్రకృచ్ఛ్రం, ప్లీహం మొదలైన వ్యాధులకి ఈ తార కారకత్వం వహిస్తుంది. పోరాట స్వభావంవల్ల కలిగే-తగాదాల అత్యధిక రక్తపోటుకి కూడా-ఈ నక్షత్రమే కారకమవుతుంది.

## 13. హస్త

కళ్ళల్లో మేహపటలాలు, అంగంపోటు, దీర్ఘకాయ–మధ్యకాయ వాతజ్వరాలూ, కడుపులో పురుగులు-నొప్పి, మూలశంక వంటి వ్యాధులకీ తార కారకత వుంటుంది. నిజానికిది ఆరోగ్యవంతమైన తార. అవయోగం పట్టినప్పుడు మాత్రం పై వ్యాధుల వంటివాటికి కారకత్వం వహిస్తూ వుంటుంది.

## 14. చిత్త

వివిధమైన వికారచేష్టలకీ, అద్భుత చేష్టలకీకూడా ఈ నక్షత్రం కారకత్వం వహిస్తుంది. అది జాతకుల జననవేళా యోగాయోగాలపై ఆధారపడి వుంటుంది. అధికభాగం వీళ్ళు ఆరోగ్యవంతులుగానే వుంటారు. అనారోగ్యం కలిగితే ఆవడం కష్టం.

## 15. స్వాతి

చక్కెరవ్యాధికీ, బట్టతలకీ ప్రధాన కారకత్వం స్వాతీ తారగానే చెబుతారు. ఇంకా ఇది సన్నిపాతం, వాతరోగం, రక్తగ్రహణి, క్యాన్సర్, కళ్ళజబ్బులు, అతిమూత్రం జీర్ణ క్రియాలోపంవల్ల కలిగే వివిధ వ్యాధులకుకూడా ఈ తారే కారకత్వం వహిస్తుంది.

## 16. విశాఖ

శ్లేష్మ సంబంధమైన వ్యాధుల్ని కలిగిస్తుంది. ఉబ్బసము, ఊపిరితిత్తులకి సంబంధించిన టి.బి. వంటి వ్యాధులు,

గుండెజబ్బులు, హిస్టీరియా, కీళ్ళవాతం, క్యాన్సరు వంటి వ్యాధులకీ తార కారకత్వం వహిస్తుంది. ముఖ్యంగా "బొల్లి" అనబడే చర్మవ్యాధికీ, 'గనేరియా' అనే సుఖ వ్యాధికీ-కారకత్వం ఈ నక్షత్రానిదేనని చెప్పబడుతోంది.

## 17. అనూరాధ

ఉష్ణ-పైత్యసంబంధ వ్యాధులు కలుగుతాయి. కురుపులు స్ఫోటకం, అగ్ని-ఆయుధాలవల్ల పీడలు, వరిబీజం, మేహవ్రణం, పైలేరియా, మలేరియా, ప్లేగు, ఎగ్జిమా, నవాయి, చుండ్రువంటి వాటికి ఈ తార కారకత్వం వహిస్తుంది. ముఖ్యంగా-శస్త్రచికిత్సలు ఈ నక్షత్రంయొక్క-కారకత్వంలో తప్పనిసరిగా చెప్పబడుతున్నాయి.

## 18. జ్యేష్ఠ

దీని కారకత్వం పిత్తశ్లేష్మదోష వ్యాధులపై ఎక్కువగా వుంటుంది. పిచ్చి, మూర్ఛ, హిస్టీరియా భగందరం, మేహ ప్రదరం, పాండురోగం, ఉదరి, ఉబ్బసం, గిలక, ఆవ నవ్వ, చుండ్రు, తలనొప్పి-పోటు-యితర సంబంధవ్యాధి, మూలశంక, మూత్రంలో రాళ్ళుపడడం, సుఖవ్యాధులు— వీటిని కలిగిస్తుంటుంది.

## 19. మూల

దీని కారకత్వం శ్లేష్మసంబంధవ్యాధులకు వుంటుంది, ప్రధానంగా ఆంబవృద్ధి కాలేయంలో కంతి-లేక-కురుపు-తత్సంబంధితబాధలు, మూలశంక, గండమాల, ఉబ్బసం, అతిసారం, సన్నిహితం అగ్ని మాంద్యం, వరిబీజం, శుక్ల నష్టం, ధాతులుప్తత, నిద్రాస్ఖలనం, న్వీర్యర వీర్యం, శిరోగండం వగయిరావ్యాధి సమూహానికి యీ మూలా నక్షత్రానిదే కారాకత్వంగా చెప్పబడుతుంది.

## 20. పూర్వాషాఢ

చిన్నాచితుకూ వ్యాధులకీతార కారకత్వం వహించదు.సరాసరి చక్కెరవ్యాధి (Sugar Complaint)రక్తపుపోటు (Blood Presure); ఊపిరితిత్తులకు సంబంధిత వ్యాధులు (T.B-or-cemi T.B); క్యాన్సరు, ఉబ్బసం, తలమీాదా బల మైన గాయం-లేదా-తలలో నరాలుచిట్లి పోవడం – ఇటు వంటి చరిత్రాత్మక వ్యాధులకీ పూర్వాషాఢ కారక తార కగా పెద్దలు చెబుతున్నారు. ఈ తారలో పుట్టినవాళ్ళు సర్వేసర్వత్రా జాగ్రత్త వహించడం చాలా మంచిది.

## 21. ఉత్తరాషాఢ

శుక్లనష్టం దీని ప్రధాన కారకత్వంగా చెప్పబడు తోంది, కాగా - కాళ్ళూకీళ్ళు అరికాళ్ళులో నొప్పులూ

నలుపులూ వుండటం, 25-30 సంవత్సరాల మధ్యన సన్ని పాతజ్వరం తగలడం, 30వయేట సరాసరి రక్తగ్రహణి సోకడం, పిల్లలు పుట్టేపాటి జీవకణాలు వీర్యంలో శూన్యం కావడం, అతికాముకత్వం, లెక్కా లెవిలూ లేకుండా వ్యభిచరించి తెచ్చుకున్న సుఖ వ్యాధులవలని ఆరాటం - యోగాగా ప్తి మొదడుకు చెందిన జబ్బుకీ - ఈ నక్షత్రమే కారకత్వం వహిస్తోందని పెద్దలవాక్కు.

## 22. శ్రవణం

వాత - జల సంబంధవ్యాధుల కారకత్వాన్ని యీ శ్రవణా నక్షత్రం వహిస్తోంది. తరచు చలిజ్వరాలూ-లేదా-చలికి తట్టుకోలేకపోవడాలూ, మధ్యమధ్య శ్లేష్మజాత జ్వరాలూ, ఒకటిరెండు దీర్ఘవ్యాధులూ - ఈ శ్రవణతారా కారకత్వంలోనికే వస్తున్నాయి.

## 23. ధనిష్ఠ

స్ఫోటకం, అగ్నిపీడ, జ్వరపీడ, కర్ణపీడ, దంతపీడ, శుక్లపీడ, రక్తాభ్యుదయ — దంతవేష్ట - కర్ణపాక - కృతూపన - ఖట్వాంగాది - సమస్త పీడలకీ - ఈ తార కారకత్వాన్ని వహిస్తోంది.

## 25. పూర్వాభాద్ర

వాతతత్వ కారకత్వం ఈ నక్షత్రం యొక్క ప్రత్యే కత. ఎంతతిన్నా-బక్క-గానే వుండేవాళ్ళకీ, ఆమ్లవాత-వ్యాధికీరక్తపోటుకీ, కడుపులో కంతో కాయో పుట్టికష్టపడిపోవడానికీ, వరిబీజానికీ, సుఖవ్యాధులకీ, 45-50 సం॥ మధ్య కళ్ళల్లో మేహాపటలాలు పుట్టడానికీ, ఇంకాదీర్ఘవ్యాధులకీ దీని కారకత్వం వుంటుంది. ఈ తారలోపుట్టినవాళ్ళు ఆరోగ్యవిషయంలో జాగ్రత్తగా వుండడం మంచిది.

## 26. ఉత్తరాభాద్ర

రక్తపుపోటు, సుఖవ్యాధులూ, చెట్లూ-లేదా యెత్తులమీద నుంచిపడి అవయవాలలో యేదో ఒకలోపం మిగిలిపోవడాలూ, మూలశంక వగయిరా రోగాలకు కారకత్వం వహిస్తుంది.

## 27. రేవతి

ఆరోగ్యవంతమైనతార. చేజేతులా చేసుకుని తెచ్చుకున్న వాధ్యులేతప్ప ఈ తారవల్ల వచ్చు వ్యాధులంటూ ప్రత్యేకంగా పెద్దగా యేమీ లేవు.

# నక్షత్ర మండలం

## నవీన వాదనలు

కోటానుకోట్ల నక్షత్రాలు గుంపులు గుంపులుగా ఈదురుకుని, మన భూమికి కోట్లాది కాంతి సంవత్సరాల దూరంలో తమకు తామై వెలుగుతూ — మనకి చుక్కల్లా కన్పిస్తున్నాయి.

అతిచిన్ని వెలుగు చుక్కల్లా కనిపించే ఈ నక్షత్రాలు నిజానికి - సూర్య చంద్రులతోనూ యితర గ్రహాల తోనూ సమానమైన వైశాల్యాలను కలిగి వున్నాయి. కొన్ని నక్షత్రాలు - ఉదాహరణకి ఆరుద్ర, జ్యేష్ఠ వంటివి సూర్యుడి కన్నా కూడా చాలా పెద్దవని - ఆ తారలు సూర్యుడి కంటే 40 రెట్లు అత్యధికమైన ఉష్ణాన్ని వెలువరిస్తున్నాయని అనేక మంది ఖగోళ పండితులు తెలియజేస్తున్నారు.

మన సౌరకుటుంబానికి చాలా దగ్గరగా వున్న నక్షత్రాలూ అంటే - మనకి సుమారు 25, 50, 00, 00, 000 మైళ్ళ దూరంలో - అక్షరాల రెండువేల అయిదు వందల యాభై కోట్ల మైళ్ళ దూరంలో వున్నాయి. సూర్యుడికన్నా పెద్దవీ, సూర్యుడి కన్నా అతి వేడినిచ్చేవీ, సూర్యుడికన్నా యెక్కువ వయస్సున్నవీ అయిన నక్షత్రాలు అనేకం వున్నాయి.

ఒకొక్క నక్షత్రానికీ 2 500 (అక్షరాలా యిరవయ్యయిదు వందల) కోట్ల సంవత్సరాలు పరమాయుర్దాయంగా తెలియబడింది.

ఆకాశంలోని అన్ని పదార్థాలూ - తమలోని కొన్ని ద్రవ్యాలని భూమికి అందజేస్తూన్నట్లే, ఈ నక్షత్రాలు కూడా రకరకాలైన ద్రవ్యాలని నేలకు పంపుతాయనీ, ఆయా ద్రవ్యాలు మానవుల పాంచ భౌతిక దేహాలకు చేరతాయనీ - అలాగే గ్రహాలచే విడుదల చేయబడిన ద్రవ్యాలు కూడా మానవపాంచ భౌతిక దేహాలకు వర్తిస్తాయనీ - ఆ కారణం వల్లనే - జన్మ నక్షత్రాలను బట్టీ, పిలుపు చుక్క (నామ నక్షత్రము) లను బట్టీ, గ్రహాలను బట్టీ మానవ జీవన గతులలోని మంచి చెడులను జాతక రూపంగా - జ్యోతిషంగా చెప్పగలగడం జరుగుతోందని ఋషి వాక్యం.

యుగయుగాల పూర్వమే మన దేశంలోని మహర్షులు ఖగోళం మీద ఒక కన్ను వేసి వుంచారు. దుస్సాధ్యమైన తమ తపో మహిమతో - ఆకాశంలోని నక్షత్రాలను కూడా గుణించారు. అలా ఋషుల చేత తెలియ చేయబడిన తారలు ఇరవయ్యేడున్నాయి. ఆ ఇరవయ్యేడు తారలకీ అశ్విన్యాది రేవతి పర్యంతంగా నామకరణాలు చేశారు.

వందలాది తారలు గుంపులుగా ఏర్పడి ఒకే తారగా కనిపిస్తాయి. వీటిలోపలి ద్రవ్యాలు విచ్ఛిత్తి కాబడి, మళ్ళీ మూలద్రవ్యంగా మారిపోతుంటాయి. అందు వలన నక్షత్రాలు నిత్యం జ్వలిస్తూనే వుంటాయి. అస్తమాటూ మండిపడుతూండే కారణంగా నక్షత్రాలపై

వాతావరణం గాని, జీవరాశిగాని ఉండే అవకాశమే లేదు.

ఇటువంటి ఈ తారలకి, గ్రహాలతో వున్న సంబంధ బాంధవ్యాలను కనిపెట్టి - గ్రహాలనూ, రాశులనూ, వాటి వాటిలో సంబంధిత తారలనూ ప్రకటించారు ఋషులు. అటువంటి ఋషుల చేతనే ప్రకటించబడిన పురాణాలలో మానవ సృష్టి ప్రారంభించబడి 200 కోట్ల సంవత్సరాలయి నట్లుగా తెలుపబడుతున్నా కూడా - ఆకాశాన్ని తీవ్రంగా శోధిస్తూన్న ఆధునిక వైజ్ఞానికులు - అసలు ఖగోళసృష్టి జరిగే యిప్పటికి 200 కోట్ల సంవత్సరాలయినట్లుగా చెబుతున్నారు. కాని-

నవీన ఋషులుగా చెప్పదగిన, ఈ కాలపు సైంటిస్టులు - భూమిమీద ప్రాణులు అనేవి పుట్టి 30 కోట్ల సంవత్సరాలే అయ్యిందనీ, అందునా మానవజాతి అనేది ఏర్పడి – మరీ బొత్తిగా మూడంటే మూడే మూడు లక్షల సంవత్సరాలయ్యిందనీ కూడా తేల్చి వేయడం జరిగింది. ఇక నక్షత్రాలు సరేసరి - ఖగోళంతోటే పుట్టాయి కదా! వేల వేలుగా వున్న ఈ నక్షత్రాలు అన్నీ ఒకేచోట గాని, మనకి ఒకే దూరంలో గాని, ఒకే ఆకారంలో గాని లేవు. నిర్ణీత కాలానికి నింగిలో పొడిచి - సూర్యకాంతి ప్రసరించగానే తుడిచి పెట్టుకుని పోతాయి.

ఒకానొక అమెరికా సైంటిస్టు అలా నక్షత్రాలని చూస్తూ చూస్తూ 22 లక్షల 53 వేల తారల్ని లెక్క పెట్టా

డట. శుభం. కాని జ్యోతిశాస్త్రావసర రీత్యా మన పూర్వీకులు 27 తారల్నే నిర్ధేశించారు. ఆ తారల్ని రోజుకొకటిగా తేల్చారు. చంద్రుడు రోజుకొక ఋక్షమండలాన్ని గమిస్తాడని చెప్పారు.

ఏ తార వున్న రోజున ఆ తారయొక్క మంచిచెడ్డల దృష్టితో - కొన్ని సమయాల త్యాజ్యాలు (వర్జ్యాలు) గా ప్రకటించారు, అవి ఈ దిగువ విధంగా వున్నాయి.

అశ్వనీ తార వచ్చిన 50 ఘడియల తరువాత 4 ఘడియలు విసర్జించాలి. ఈ విధంగా ఒక్కొక్క తారలో ఒక్కొక్క సమయం.

## తారలు - త్యాజ్యవేళలు

1. అశ్వని - ప్రవేశాది 50 ఘ॥ పైన 4 ఘ॥లు
2. భరణి – 2 4ఘ॥ పైన 4 ఘ॥లు
3. కృత్తిక - 30ఘ॥ పిదప 4 ఘ॥లు
4. రోహిణి - 40ఘ॥
5. మృగశిర -14ఘ॥
6. ఆర్ద్ర - 21 ఘ॥
7. పునర్వసు - 30 ఘ॥
8. పుష్యమి - 20 ఘ॥
9. ఆశ్లేష - 32ఘ॥
10. మఖ - 20ఘ॥
11. పుబ్బ - 21ఘ॥

12. ఉత్తర - 18 ఘు॥
13. హస్త - 21 ఘు॥
14. చిత్త - 20 ఘు॥ పైన 4ఘు॥లు
15. స్వాతి-14 ఘు॥
16. విశాఖ - 14 ఘు॥
17. అనూరాధ - 10 ఘు॥
18. జ్యేష్ఠ - 14 ఘు॥
19. మూల - 56 ఘు॥
20. పూర్వాషాఢ - 24 ఘు॥
21. ఉత్తరాషాఢ - 20 ఘు॥
22. శ్రవణం - 10 ఘు॥
23. ధనిష్ఠ - 10 ఘు॥
24. శతభిషం - 18 ఘు॥
25. పూర్వాభాద్ర - 24 ఘు॥
26. ఉత్తరాభాద్ర - 24 ఘు॥
27. రేవతి - 30 ఘు॥

ఇక ఈ నక్షత్రాల రీత్యా జాతకాలు చెప్పవచ్చునను కున్నాము కదా? అందుకోసం నక్షత్రాలని పాదాలుగా విభజించారు. ఒక్కొక్క నక్షత్రాన్ని నాలుగేసి పాదాలు చొప్పున విడమరచి, మొత్తం 27 నక్షత్రాలనీ కలిపి 27×4= 108 తారాపాదాలని తలపెట్టారు.

ఈ నూట యెనిమిది పాదాలనీ-12 రాశులకు పంచి

పెట్టారు. వరుసక్రమంలో ఒక్కొక్క రాశికీ 9నక్షత్ర పాదాలయ్యాయి. అవి ఈ దిగువ విధంగా వున్నాయి.

1. అశ్విని 4పాదాలూ, భరణి 4పాదాలూ, కృత్తికలో మొదటిపాదం వెరసి 9 పాదాలు మేషరాశి.

2. కృత్తికలో మిగిలిన 3పాదాలూ, రోహిణి 4పాదాలు, మృగశిరలో 1, 2 పాదాలూ, వెఱసి 9పాదాలు వృషభం.

3. మృగశిరలో మిగిలిన 2పాదాలూ, ఆరుద్ర 4పాదాలు, పునర్వసు 1-2-3 పాదాలూ, వెఱసి 9పాదాలు మిథునం.

4. పునర్వసులో ఆఖరిపాదం, పుష్యమి 4పాదాలు, ఆశ్లేష 4పాదాలూ, వెఱసి 9-కర్కాటకం

5. మఖ 4పాదాలు, పుబ్బ 4పాదాలు, ఉత్తర మొదటి పాదం, వెఱసి 9-సింహరాశి

6. ఉత్తర 2-3-4పాదాలు, హస్త 4, చిత్త 1-2పాదాలు వెఱసి 9-కన్యారాశి

7. చిత్తలో 3-4పాదాలు, స్వాతి 4, విశాఖ తొలిమూడు పాదాలూ, వెఱసి 9-తులారాశి

8. విశాఖ 4వపాదం, అనూరాధ 4, జ్యేష్ఠ 4పాదాలు వెఱసి 9-వృశ్చికరాశి

9. మూల 4, పూర్వాషాఢ4, ఉత్తరాషాఢ తొలిపాదం, మొత్తం 9-ధనూరాశి

10. ఉత్తరాషాఢ 2-3-4 పాదాలూ, శ్రవణం 4, ధనిష్ఠ 1-2 పాదాలూ-కలిసి 9-మకరరాశి

11. ధనిష్ఠ-3-4 పాదాలూ, శతభిషం 4, పూర్వాభాద్ర 1-2-3 పాదాలూ- కలిసి 9-కుంభరాశి.

12. పూ॥భాద్ర 4వపాదం, ఉత్తరాభాద్ర 4, రేవతి 4-కలిసి 9-మీనరాశి.

## గ్రహ - దశా - విభజనం

ఇక, అశ్విన్యాదిగా 27 నక్షత్రాలనీ 3నవకాలుగా తీర్చి, ఆ మూడు నవకాలలోనూ తొలిమూడు తారలనీ ఒకగ్రహానికీ, మలిమూడు తారలనీ మరొక గ్రహానికీ-ఇలా మూడేసి తారల చొప్పున తొమ్మిది వర్గాలు నిర్మించి-ఆ తొమ్మిది వర్గాలనీ నవ (9) గ్రహాలకూ సంబంధింపచేశారు తత్కారణంగా-ఆయా తొమ్మిది వర్గాలా మూడేసి తారలైనవి జన్మనక్షత్రంగా కలిగిన-లేదా-పిలుపురిక్క (నామ నక్షత్రం)గాకలిగిన ప్రాణికోటికి-జననాది ప్రారంభదశలుగా ఒక కట్టుబడినికూడా చేశారు. ఆయా గ్రహదశా ఫలితాలని కూడా సవివరంగా తెలియబరిచారు. అవి ఈ విధంగా వున్నాయి.

# జననాది ప్రారంభ దశాఫలాని

| క్రమ సంఖ్య | వర్గ తారాత్రయ నామములు | | | ప్రారంభ దశ కాలము | తద్దశకాల ఫలము |
|---|---|---|---|---|---|
| 1 | అశ్వని | మఖ | మూల | కేతు దశ-7 సం॥ | అరకొర శుభాలు, అశాంతి, ఖర్చు. |
| 2 | భరణి | పుబ్బ | పూ॥షాఢ | శుక్రదశ-20 సం॥ | అనారోగ్యం, శస్త్రపీడ, శేషం శుభం. |
| 3 | కృత్తిక | ఉత్తర | ఉ॥ షాఢ | రవిదశ-6 సం॥ | ఒత్తిడి, ఖర్చు,పితృపీడ,బెంగ |
| 4 | రోహిణి | హస్త | శ్రవణం | చంద్రదశ-10 సం॥ | అశాంతి,ఆందోళన,క్రమశః ఆరోగ్యం |
| 5 | మృగశిర | చిత్త | ధనిష్ఠ | కుజదశ-7 సం॥ | గాయాలు, అగ్నిపీడ, బాలారిష్టాలు |
| 6 | ఆరుద్ర | స్వాతి | శతభిష | రాహుదశ-18 సం॥ | తండ్రికి యోగం,వ్యయం,బంధుపీడ |
| 7 | పునర్వసు | విశాఖ | పూ॥భాద్ర | గురుదశ-16 సం॥ | విద్యా వృద్ధి, కుటుంబ ప్రేమ, ఖ్యాతి |
| 8 | పుష్యమి | అనూరాధ | ఉ॥భాద్ర | శనిదశ-19 సం॥ | తండ్రికి యోగం, లాభం, మేలు |
| 9 | ఆశ్లేష | జ్యేష్ఠ | రేవతి | బుధ దశ-17 సం॥ | ధనలాభం,కుటుంబశ్రేయం,శుభం. |